# సోవియట్ సమీక్ష




భారతదేశంలో దస్తయేవ్‌స్కీ పరిచయం

ఆసియా పసిఫిక్ ప్రాంతంలో భద్రత

సోవియట్ సమాజ ప్రజాస్వామీకరణ

మాస్కో శిఖరాగ్ర సమావేశం

# సంబంధాలు







మాస్కోలోని యంగ్ కాస్మోనాట్స్ క్లబ్‌లో సోవియట్ పైలట్-కాస్మోనాట్ ఎ.ఎ. సెరెబ్రోవ్, అమెరికన్ ఆస్ట్రోనాట్ కదీ సల్లివాన్

బోల్షాయ్ థియేటర్‌లో "సిరానొ డి బెర్జెరాక్" బ్యాలేను నిర్వహించిన ప్రముఖ ఫ్రెంచి నృత్య రూపకల్పనావేత్త రోనాల్డ్ పెటిట్, బ్యాలేలో ముఖ్యపాత్ర వహించిన లుడ్మిలా సెమెన్యకా, ఇరెక్ ముహమ దేవ్‌లు.

అంతరిక్ష జీవశాస్త్రం, వైద్యశాస్త్రంలో సహకారం గురించిన అమెరికా సోవియట్ కార్యనిర్వాహక బృందం.

“సోవియట్ యూనియన్ కూడా
ఆసియన్ దేశమూ,
పసిఫిక్ దేశమూ.
సువిశాలమైన యీ మండలం
యెదుర్కొంటున్న సంక్లిష్ట సమస్యలు
దానికి భాగా తెలుసు...
ప్రపంచంలోని
యీ విశాలమైన
భూభాగానికి సంబంధించి
సోవియట్ యూనియన్
తులనాత్మకమైన సమగ్రమైన వైఖరిని
నిర్ధారించేది యిదే.
యిక్కడ అనేక జాతులు,
దేశాలు పెద్ద సంఖ్యలో వున్నాయి.
యీ మండలంలోని
ప్రస్తుత వాస్తవికతల గుర్తింపు,
అవగాహనలు
మా వైఖరికి
ప్రాతిపదికగా వున్నాయి.

(వ్లాదివొస్తొక్‌లో 1986 జులై 26 న
గొర్బచేవ్ చేసిన ప్రసంగం నుండి)



# సోవియట్ సమీక్ష

7

సంపుటి 22

జూలై

1988

●

సంపాదకుడు :
వై. ఎల్. ఫ్రొలోవ్
సంయుక్త సంపాదకుడు :
జి. ఆళవందార్
సహాయ సంపాదకుడు
మునగాల జనార్దన రెడ్డి
ఆర్టిస్ట్
ఎల్. వి. గుషేవ

●

పుటలరూపరచన
వి. పల్యాకవ్

●

11 భారతీయ భాషల్లో వెలువడే పత్రిక

●

SOVIET SAMEEKSHA - (Telugu)

●



ఈ సంచికలోని చిత్రాలు, వ్యాసాలు
నొవొస్తి వార్తా సంస్థవి

●

Printed by A.N.Kazantsev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road– Madras-600 017, (Phone:440201), for the Information Department of the USSR Embassy in India.. Printed at Pavai Printers (P) Ltd., 142, Jani Jan Khan Road, Madras-600014.

# ఈ సంచికలో



12



భూకక్ష్యలో భారతీయ వుపగ్రహం

1988 మార్చి 17 న భారతీయ వుపగ్రహం ఐ.ఆర్.ఎస్ - 1ఎ ను బూస్టర్ వోస్తోక్ కక్ష్యలో ప్రవేశ పెట్టింది.

57



భారతదేశంలో దస్తయేవ్‌స్కీ వారసత్వం



# పర్షియన్ సింధుశాఖ

ఇది భూమ్మీద వుద్రిక్తతాల వాలాల్లో ఒకటి. ఇరాన్, ఇరాక్‌ల మధ్య ఘర్షణకు కారణాలపై, యీ యుద్ధ మగ్న దేశాల్లోని పరిస్థితిపై ఒక విశ్లేషణ.

50



మెట్రోపోలిటన్

# దవీద్

53

మంచితనం పట్ల గట్టి నమ్మకంతో కూడిన వివేకానికి విజయం తప్పక లభిస్తుందంటారాయన.

సుఖుమై అబ్‌ఖాజియా మెట్రోపోలిటన్ దవీద్ వయసు 62. ఆయన డయోసిస్ ఆధ్వర్యాన 20 చర్చీలు వున్నాయి. ఆయన బోధలను సోవియట్‌లోని ఆస్తికులతోపాటు అమెరికా, పశ్చిమ జర్మనీ, యింకా యితర అనేక దేశాల ఆస్తికులు శ్రద్ధతో వింటారు.

3

# సంపాదక వ్యాసం

మాస్కోలో 1988 మే 29 నుంచి జూన్ 2 వరకు జరిగిన సోవియట్-అమెరికా శిఖరాగ్ర సమావేశం అంతర్జాతీయ సంబంధాల్లో ఒక ప్రధాన ఘట్టంగా గుర్తింపు పొందింది. మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలనసంధిని ధ్రువీకరించే పత్రాలను యీ సమావేశంలో పరస్పరం అందజేసుకోవడంతో అణ్వస్త్ర విసర్జన శకం నిజంగా ప్రారంభమైంది. నిరాయుధీకరణ క్రమాన్ని త్వరితపర్చే, ప్రపంచానికి అణ్వాయుధాల బెడద లేకుండా చేసే యంత్రాంగం రూపునందుకుంటోందని యీ చర్య తెలియజేస్తోంది. అణుయుద్ధం అనూహ్యమైనదనీ, ఒకరిపై మరొకరు సైనికాధిపత్యాన్ని సాధించడానికి చేసే ప్రయత్నం అర్థరహితమైనదనీ, జెనీవాలో అంగీకరించిన విధానంనుండి యీ దృఢమైన చర్యే వుద్భవించడం యెంతో హర్షదాయకం.

అంతర్జాతీయ వ్యవహారాల్లో అమెరికా ప్రభుత్వం కనబరుస్తున్న వాస్తవికత — యిదే లేకపోతే ప్రాంతీయ సమస్యలతో సహా ప్రపంచ స్థాయి సమస్యల పరిష్కారాన్వేషణలో నిర్మాణాత్మక సహకారం, పరస్పరావగాహన సుదూర లక్ష్యంగా వుండిపోయేది—యీ శిఖరాగ్ర సమావేశ సుస్పష్ట ఫలితమే. యీ వాస్తవిక వైఖరికి కారణం ప్రస్తుత సోవియట్ నాయకత్వం నిరంతరంగా పూనికతో అనుసరిస్తున్న సోవియట్ శాంతికాముక విధానమే; యీనాటి తక్షణ సమస్యల పరిష్కారాన్వేషణకు మిహయీల్ గోర్బచేవ్ చేస్తున్న నిర్విరామ కృషే. యీ శిఖరాగ్ర సమావేశం విజయవంతం కావడానికి కారణం చాలావరకు యీ విధానమే, యీ కృషే. సోవియట్ యూనియన్‌తో సంభాషణలు కొనసాగించడానికి, వాటిని ప్రగాఢం చేయడానికి కృతనిశ్చయంతో వున్నట్లు అధ్యక్షుడు రీగనూ, అధ్యక్ష పదవికి పోటీపడుతున్న యిద్దరు అభ్యర్థులూ ప్రకటించడం యాదృచ్ఛికమేమీ కాదు.

సోవియట్ జీవితంలోని అన్ని అంశాలను ప్రజాతంత్రయుతంగా పునర్వ్యవస్థీకరించే కృషిలో నిమగ్నమైవున్న సోవియట్ ప్రజలను చూసే అవకాశం తమ సోవియట్ పర్యటన సందర్భంగా అమెరికా అధ్యక్షునికి లభించింది. సోవియట్ యూనియన్-అమెరికా సంబంధాలను సాధారణ స్థాయికి తెచ్చే విధానాన్ని సోవియట్ ప్రజలు నిర్మొహమాటంగా, సద్భావంతో, హృదయపూర్వకంగా బలపరుస్తున్నట్లు ఆయన కనులారా చూశారు. సోవియట్ యూనియన్ 'దుష్ట సామ్రాజ్యం' అని లోగడ తాను చేసిన ప్రకటనలను, అందువల్లనే అమెరికన్ అధ్యక్షుడు యెలాంటి తడబాటు లేకుండా బహిరంగంగా వుపసంహరించుకున్నారు. అందువల్ల మనం భవిష్యత్తులోకి ఆశావాదంతో చూడడానికి ఆస్కారముంది. వ్యూహాత్మక దాడి ఆయుధాలను 50 శాతం తగ్గించుకునేందుకు వుద్దేశించిన సంధిని కుదుర్చుకోడానికి శిఖరాగ్ర సమావేశం కృషివల్ల లభించిన రూపు యీ ఆశావాదానికి దన్నుగా వుంది.

# సోవియట్ - అమెరికా 4వ శిఖరాగ్ర సమావేశం: నిరాయుధీకరణ క్రమానికి ప్రేరణ

స్పర్తాక్ బేగ్లవ్

మాస్కోలో యిటీవల జరిగిన సోవియట్ అమెరికా 4 వ శిఖరాగ్ర సమావేశ ఫలితాలను, ప్రాముఖ్యాన్ని రెండు గీటు రాళ్ళ సహాయంతో అంచనా వేయవచ్చు. నిర్దిష్టమైన తక్షణ ఫలితాలు ఒకటి; దీర్ఘకాలిక పర్యవసానాలు రెండోది.

మొదటి విషయం. పైజెప్పినవాటి జాబితా వైవిధ్య పూరితంగా వున్నప్పటికీ, సంచలనం కలిగించేదేమీ అందులో లేదని కొందరు భావిస్తున్నారు. వ్యూహాత్మక ఆయుధాల్లో 50 శాతం కోతను గురించి భవిష్యత్తులో కుదుర్చుకోనున్న సంధి; సైనిక రంగంలో విశ్వాస సంవర్థక చర్యల గురించీ, అలాగే శాస్త్ర, సాంకేతిక, ఆర్థిక, సాంస్కృతికపరమైన వివిధరంగాలలో సహకారాన్ని గురించీ కుదుర్చు కోనున్న ఒప్పందాల సముదాయం—వీటికి సంబంధించిన చిక్కుముడినివిప్పడంలో సాధించిన పురోగతి గురించి యిక్కడ వివరిస్తున్నాం. మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసలిల సిర్యూలన గురించిన సంధిని ఆమోదించే పత్రాలను యిచ్చి పుచ్చుకోవడం యీసమావేశంలోమరొక అత్యంత ముఖ్యమైన ఘటన. రెండురకాల అణ్వాయుధాల నిర్మూలనకూ, చరిత్రలో నిజమైన నిరాయుధీకరణకూ చివరికి ఆమోదం లభించినందువల్ల యిది సంకేతప్రాయమైన చర్యకన్నామించినది.

మాస్కో శిఖరాగ్ర సమావేశంలో లభించిన విస్తృత ఫలితం స్పష్టంగా కనిపించక పోయినప్పటికీ, యిది మొత్తం సోవియట్-అమెరికా సంబంధాలకు ఒకరకంగా అమితమైన వేగాన్ని కూడా సంతరించిపెట్టింది. బహుశ, రీగన్ అధ్యక్ష పదవి ముగుయబోతున్నప్పుడు మాత్రమే మాస్కో శిఖరాగ్ర సమావేశం జరిగిందని కొంతమంది పరిశీలికులు భావించవచ్చు. కాని అమెరిక నూతన నాయకత్వానికి రీగన్ తన రాజదండాన్ని అందించడం యీసమావేశమొత్తం సారాంశమని అలంకారికంగా చెప్పవచ్చు; ముఖ్యమైన యీ విషయాన్ని మనం దృష్టిలోకి తీసుకోకుండా వుండలేము. అత్యంత స్పష్టమైన సందేశంతో కూడిన ఆదేశం యీరాజదండంలో గర్భితం: యీరెండు దేశాలూ తాము వుమ్మడిగా సాధించిన విజయాన్ని-తలపాటును అధిగమించడం, శిఖరాగ్రస్థాయి సంభాషణకోసం, నిరాయుధీకరణ సంప్రతింపుల యంత్రాంగంకోసం ఒక శాశ్వతమైన నిర్మాన్వరూపాని నెలకొల్పగంతోబాటు మరింత నాగరమైన సంబంగాలకు మారడం జారవిడుచు కోరాదు.

అమెరికా విదేశాంగ విధానం స్పష్టమైన రీతిలో పరిణామం చెందడానికి తనవంతు దోహదం చేకూర్చిన మిహాయిల్ గోర్బచేవ్‌కు అంతర్జాతీయ ప్రజలు సముచితమైన గౌరవాన్ని యిస్తారని నేను భావిస్తున్నాను. వాస్తవికత, నూతన ఆలోచనాధోరణి అనేవి మాస్కో గుత్తసొమ్ముకావు. వాటిని అందరూ వినియోగించుకోవచ్చు. అమెరికా అధ్యక్షుని వెంట వచ్చిన ప్రముఖ పాత్రికేయులతో నేను మాట్లాడినప్పుడు, సోవియట్ యూనియనలోని పరిస్థితుల పున్యాయాన్ని అమెరికా సమర్థించడం మంచిగా కాదా అని వారు తర్జనభర్జనలో పడ్డారు. కొత్త టైంటేబుల్ ప్రకారం, మన రైలు వెళ్లి పోయింతర్వాత పాత టైంటేబుల్‌ను గురించి ఆలోచించటంలాంటదే యిదని నేను వారితో అన్నాను.

కాని, గత మూడేళ్ళలో సంభవించిన పరిణామాలన్నీ కేవలం విజయానికి తార్కాణమని దీనంతటి అర్థం యెంతమాత్రంకాదు. శిఖరాగ్ర

సమావేశం ముగిసింతర్వాత సి.పి.ఎస్.యు. కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి పాత్రికేయులతో జరిపిన సమా వేశంలో, అమెరికా విధానంలో మిగిలివున్న ఒక వైరుధ్యాన్ని వారికి గుర్తుచేయడం మంచిదని భావించారు. ఒకవైపున, అణుయుద్ధ మనేది అనూహ్యామైనదనీ, ఒకరిపై మరొకరు సైనికాధిక్యత సంపాదించడానికి ప్రయత్నించడం అర్థరహితమనీ జెనీవాలో అంగీకరించిన మౌలిక సూత్రం యీ విధానానికి చాలావరకు మార్గదర్శ కంగావుంది. మరోవైపున, ఆసూత్రాన్ని అభివృద్ధి చేయడానికీ - ఆధునిక ప్రపంచంలోని వాస్తవిక తల దృష్ట్యా, సైనికపద్ధతులద్వారా యేసమస్యనూ పరిష్కరించజాలమనే, శాంతియుత సహజీవనం, సమానత అనేవి అందరికీ ప్రామాణికమైన కట్టు బాటుగా మారాలనే పరస్పరాగాహనను నమోదు చేయడానికీ-మాస్కో సమావేశంలో అమెరికా నాయకత్వం సంసిద్ధతను కనబర్చలేదని రుజువైంది. ప్రాంతీయ ఘర్షణలు, మారుతున్న ప్రపంచ వాస్త వికతలు, సోవియట్ యూనియన్‌తో, సోషలిస్టు దేశాలలో సహకారం-వీటిపట్ల అమెరికా కనబరుస్తున్న వైఖరినిబట్టి అమెరికా విధానంలోని వైరుధ్యం వ్యక్తమౌతోంది.

ప్రస్తుతం సోవియట్ యూనియన్, అమెరికాల మధ్య జరిగిన సంభాషణలో సాధించిన ప్రధాన విజయంవల్ల వాటి సంబంధాలు నిజమైన రాజ కీయాల స్థాయికి పెరిగాయనేది మిహాయిల్ గొర్బ చేవ్ అభిప్రాయం. ఒక రాజనీతిజ్ఞుడుగా రోనాల్డ్ రీగన్ కనబర్చిన వాస్తవికతను యీ సందర్భముగా మిహాయిల్ గొర్బచేవ్ సంపూర్ణంగా గౌరవించారు. అమెరికా అధ్యక్షుని మాస్కో పర్యటనలోని మరో ముఖ్యామైన అంశం: సోవియట్ యూనియన్‌ను యిప్పటికీ "దుష్ట సామ్రాజ్యం"గా భావిస్తున్నారా అని అమెరికా ప్రభుత్వాధిపతిని ఒక సోవియట్ పౌరుడు ప్రశ్నించినప్పుడు "లేదు"అని ఆయన జవాబు చెప్పారు. మనస్పూర్తిగా చెప్పిన యీఒక్క మాటా కొన్ని అలంకారప్రాయమైన ప్రకటనలకన్నా విలువైనది.

సి.పి.ఎస్.యు. కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి అనేక ప్రసంగాల్లో ఒకే భావాన్ని పదేపదే పేర్కొనడం చాలామంది గమనించేవుంటారు. వాస్తవికవాదిగా మారాలంటే పుకార్లను నమ్ముతూ, కాలంచెల్లిన మూసపోత పద్ధతులను పట్టుకొని వేలాడడంగాక వాస్తవాలను, పరిణామక్రియలను చాలా లోతుగా పరిశీలించాలి. వుదాహరణకు మానవహక్కుల సమస్యను తీసుకుందాం. సోవియట్ యూనియన్ లోని నేటి వాస్తవాలను అర్థంచేసుకోడానికి యిప్ప టికీ పూర్వపు అనుభవాలు అడ్డొస్తున్నాయి. సోవియట్ యూనియన్‌పట్ల "అత్యంత అనుకూల ధోరణి'' తో వ్యవహరించాలని అమెరికా లోగడ చట్టంచేసింది. ఉభయదేశాల ఆర్థికసంబంధాల్లో అమెరికా దాన్నే యిప్పటికీ ఆచరించాల్సివస్తోంది. "మృతజీవులు సజీవులను పీడించడమంటే యిదే'' అని సోవియట్ నాయకుడు పేర్కొన్నారు.

కానీ, సోవియట్-అమెరికా నూతన సంబంధాలు జీవశక్తిని పుంజుకుంటున్నాయని చెప్పడానికి ఆధారాలున్నాయి. నిజమైన రాజకీయాలను అనుస రించాలనే ఆకాంక్ష మాస్కో శిఖరాగ్ర సమావేశంలో స్పష్టంగా వ్యక్తమైంది. సంభాషణ ముమ్మరంగా కొనసాగుతోందనే భావం యీ శిఖరాగ్ర సమా వేశంలో ప్రబలంగా కనిపించడంతో యీభావం ధృఢపడింది. వ్యూహాత్మకదాడి ఆయుధాల గురించిన సంధిని సకాలంలో తయారు చేసినట్లయితే ప్రస్తుత అమెరికా అధ్యక్షునితో 5 వ సమావేశం జరిపే అవకాశంలేక పోలేదు. అదనంగా చేయాల్సినపని యింకా చాలా వున్న ప్పటికీ, అనేక కీలకమైన నిబంధనలు నమోదై వున్న సంయుక్త ముసాయిదా సంధి యిప్పటికే సిద్ధంగా వుందని వుభయపక్షాలూ ప్రకటించాయి. వ్యూహాత్మక దాడి ఆయుధాల తగ్గింపు అనేది లోగడ యుద్ధానంతరం అంతర్జాతీయ రాజకీయాల్లో వుభయపక్షాలకూ యెదురైన అత్యంత సంక్లిష్ట మైన కర్తవ్యాలకన్నా సంక్లిష్టంగా వుందని యిప్పుడు స్పష్టంగా అర్థమౌతోంది.

ప్రాంతీయఘర్షణలను రాజకీయ పద్ధతిలో పరిష్కరించగల అవకాశాన్ని ఆఫ్ఘనిస్తాన్ చుట్టూ వున్న పరిస్థితికి జెనీవా తరహా పరిష్కారం సమకూ ర్చిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా వుం డం - యిదే క్లిష్టమైన మరొక కర్తవ్యం. యూరప్‌కు సంబంధించి, అట్లాంటిక్‌నుంచి ఊరల్స్‌వరకూ సాయుధ బలగాలను, ఆయుధాలను తప్పని సరిగా తగ్గించాల్సిన అవసరం పట్ల తక్షణం శ్రద్ధ వహించాల్సివుంది.

మొత్తంమీద యీ రంగాలన్నిట్లో వుభయ రాజ్యాలూ తమ స్థానాలను సమన్వయపర్చుకోవడం ద్వారా మాస్కోలో, మరింత ఫలితం సాధించి వుండేవనేది సార్వత్రిక అభిప్రాయం.

# మాస్కో శిఖరాగ్ర సమావేశం: ఆసియా పసిఫిక్ ప్రాంతంలో భద్రత

వ్లదీమిర్ ఇవానవ్, ఎం.ఎ (చరిత్ర)

సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ ఆధ్వర్యానగల ప్రపంచ ఆర్థిక వ్యవస్థ, అంతర్జాతీయ వ్యవహారాల ఇన్‌స్టిట్యూట్‌లోని పసిఫిక్ విభాగ అధిపతి.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీకేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్‌కూ, అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్‌రీగన్‌కూ మధ్య 4వ శిఖరాగ్ర సమావేశం మాస్కోలో జరిగింది. నిరాయుధీకరణ సమస్యలకు సంబంధించి సోవియట్ - అమెరికాల మధ్య కొనసాగిన యీ సమావేశం ఐ.ఎన్.ఎఫ్. సంధి ధ్రువీకరణను పూర్తి చేసింది; వ్యూహాత్మక దాడి ఆయుధాల్లో 50 శాతం తగ్గించేందుకు సంబంధించిన సంధిని కుదుర్చుకునే కృషికి నూతన ప్రేరణను యిచ్చింది.

మాస్కో శిఖరాగ్ర సమావేశం మొత్తం మీద అంతర్జాతీయ వాతావరణంపై, ప్రత్యేకించి ఆసియా, పసిఫిక్‌లలోని పరిస్థితిపై సానుకూల ప్రభావాన్ని నెరపగలదని ఆశించవచ్చు. అణ్వాయుధాలను నిర్మూలించాలనీ, అణ్వస్త్రరహిత మండలాలను నెలకొల్పాలనీ ఆసియా, పసిఫిక్ దేశాలు యిప్పటికీ చాలా యేళ్ళుగా ప్రకటిస్తున్నాయి. యివి సహజమైన కోరికలే. అణ్వాయుధాలకు గురైనవి యీ దేశాలు మాత్రమే. 1945 ఆగస్టులో జపాన్‌లోని హిరోషిమా, నాగసాకీలమీద అమెరికా అణుబాంబులు వేసింది. మైక్రోనీషాలోని ప్రజలు యీ ప్రాంతంలో జరిగిన అణువిస్ఫోటనల ఫలితంగా యిప్పటికీ యీ మృతధూళితో, యితర వ్యాధులతో బాధపడుతున్నారు. ఆసియా, పసిఫిక్ ప్రాంతంలోని ప్రస్తుత పరిణామాల్లో యెంతసంకీర్ణత, వైవిధ్యం వున్నప్పటికీ, అక్కడ అణ్వస్త్ర వ్యతిరేక మనోభావాలు పూవునందుకుంటున్నాయి.

ఐ.ఎస్.ఎఫ్. సంధి ధ్రువీకరణ పొందడంతో, రెండు రకాల అణ్వాయుధాల నుంచీ మానవాళిని బెడదలేకుండాఆయుధాలను నిజంగా తగ్గించేందుక్కు కృషిప్రారంభమైంది. మాస్కో శిఖరాగ్రసమావేశంలో ధ్రువీకరణ పత్రాలను

యిచ్చిపుచ్చుకోవడంతో, దశాబ్దాల తరబడి క్రమంగా పెరుగుతూ వచ్చిన అణుయుద్ధ ప్రమాదం తగ్గుముఖం పట్ట సాగింది. ఆసియా, పసిఫిక్ బేసిన్‌లో సోవియట్‌యూనియన్‌కు చెందిన ఆసియా ప్రాంతంలో మిసిలీలు వున్నాయి. వీటిని నిర్మూలించడానికి కూడా యీ క్రమం తోడ్పడు తుంది. యిదేరకమైన అమెరికన్ మిసిలీలను ఆసియాలో, పసిఫిక్‌లో యికముందెప్పుడూ మోహరించకూడదనే హామీలు కూడా వున్నాయి.

ఐ.ఎన్.ఎఫ్ సంధిపై సంతకాలు జరిగి, వాటిని ధ్రువీకరించడమనేది నిరాయుధీకరణ క్రమంలో జాప్యం జరగకుండా చేసింది. యీ విధంగా, వాషింగ్టన్‌లో ప్రారంభమైన క్రమాన్ని మాస్కో శిఖరాగ్రసమావేశం కొనసాగించింది. యీ మార్గాన్ని దృఢంగా అనుసరిస్తామనే వుద్దేశాన్ని వుభయపక్షాలూ వ్యక్తం చేశాయి. వ్యూహాత్మక దాడి ఆయుధాల గురించిన సంధిపై 1988లో సంతకాలు జరగ డానికి యిప్పటికీ అవకాశాలున్నట్టు యీ సమావేశా నంతరం జరిగిన పత్రికాగోష్ఠిలో మిహాయిల్ గొర్బచేవ్ పేర్కొన్నారు.

ఆసియా, పసిఫిక్ బేసిన్‌ను సైనికీకరించే ప్రమాదాన్ని వ్యూహాత్మక దాడి ఆయుధాల గురించిన సంధి తిరుగుముఖం పట్టించగలదు. ప్రపంచంలోని మొత్తం 25,000 నౌకాస్థిత అణు శీర్షాల్లో సగం, ప్రపంచ వ్యాప్త అణుయుద్ధానికి వుద్దేశించిన అమెరికా సైనిక స్థావరాలు, యంత్ర వ్యవస్థలు సుమారు 90 యీ ప్రాంతంలో కేంద్రీకృత మైవున్నాయి. "నక్షత్రయుద్ధాలను" అమలు జరప డానికి అవసరమైన వ్యవస్థలను ఆస్ట్రేలియా, జపాన్, దక్షిణకొరియా, ఫిలిప్పైన్స్‌లలో, డీగోగార్షియా దీవిలో, మైక్రోనీసియాలోని క్వాజలైన్ దీవిలో మోహరించాలని అమెరికా పథకాలు వేస్తోంది. నిరాయుధీకరణ వుద్యమం వూపునందుకుంటే, రాజ్యాల మధ్యగల వివాదాలను పరిష్కరించడంలో బలప్రయోగం ఆమోదయోగ్యంకాదని మానవాళి గుర్తిస్తే, అణ్వాయుధాలను చూపి బెదిరించే సిద్ధాంతాన్ని అణ్వాయుధాలు గల రాజ్యాలు విసర్జిస్తే (పైన పేర్కొన్న వాటిలో చివరి అంశం పూర్తిగా సాధ్యమని ప్రస్తుతం కొనసాగుతున్న సోవియట్ - అమెరికా సంభాషణ రుజువుచేస్తోంది). ఆసియాలో, పసిఫిక్‌లో సాగుతున్న శాంతి వుద్యమం తన విస్తృత శక్తిసామర్థ్యాలను పూర్తిగా సాధించగలదు. దీనివల్ల దక్షిణ పసిఫిక్ అణ్వస్త్రరహిత మండలసంధిని (రారటోంగాసంధి) పటిష్టం చేసేందుకు హామీలు లభిస్తాయి. కానీ, వీటికి సంబంధించిన కరారునామాలపై యిప్పటికీ అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లు సంతకాలు చేయ లేదు. ఈ హామీలవల్ల ఆగ్నేయాసియాను అణ్వస్త్ర రహితమండలంగా ప్రకటించేందుకు అవసర మైన పరిస్థితులన్నిటినీ సమకూర్చడం జరుగు తుంది. కొరియా ద్వీపకల్పంలో యిలాంటి మండ లాన్నే నెలకొల్పేందుకు గల అవకాశాలను పరిశీ లించడం జరుగుతుంది. ఆసియాలోని, పసిఫిక్ బేసిన్‌లోని అనేక విదేశీ సైనిక స్థావరాలను నియంత్రించడానికి విశ్వాస సంవర్ధక చర్యలలో పురోగతీ, ప్రత్యక్ష తనిఖీలూ తోడ్పడగలవు. నియంత్రణ గురించిన ఒప్పందాల వల్ల యీ ప్రాంతంలోని దేశాలకు తమ భూభాగాల్లో యెలాంటి చట్టవిరుద్ధమైన కార్యకలాపాలు కొనసాగడం లేదనీ, స్థానిక ప్రజలకు హానికలిగించే యెలాంటి ఆయుధాలను విదేశీ సైనిక స్థావరాల్లో నిల్వచేయడం లేదనీ నమ్మకం యేర్పడుతుంది.

ప్రాంతీయ ఘర్షణల సమస్యవిషయంలో సాను కూలమైన మార్పులొస్తున్నాయి; వీటిని గురించి సోవియట్ - అమెరికా శిఖరాగ్ర సమావేశంలో చర్చలు జరిగాయి. యివి ఆసియా, పసిఫిక్‌లకు తక్షణం అవసరమైన చర్చలు. అఫ్గనిస్తాన్ గురించిన జెనీవా ఒప్పందాలను గురించి మిహాయిల్ గొర్బచేవ్ పత్రికాగోష్ఠిలో ప్రస్తావిస్తూ, వీటికి హామీ దారులైన సోవియట్ యూనియన్, అమెరికాలు ప్రాంతీయ ఘర్షణలను నిరోధించడంలో రెండు మహత్తర దేశాల సంయుక్త చర్యలకు మొట్ట మొదటి ఆదర్శం అయ్యాయని చెప్పారు. సమతూక ప్రయోజనాలనే గట్టి పునాది ప్రాతి పదికపై ప్రాంతీయ సమస్యలను పరిష్కరించడానికి నిజమైన అవకాశాలున్నాయి. కంపూచియాలోని, కొరియాలోని, యితర వుద్రిక్త ప్రాంతాల్లోని పరిస్థితిని మామూలు స్థాయికి తెచ్చేందుకు అర్థవంతమైన, ఆచితూచిన వైఖరిని రూపొందిచడం సాధ్యమని మొత్తంమీద అఫ్గనిస్తాన్ అనుభవం రుజువు చేస్తోంది.

# భవిష్యత్తుకు పునాదులు

## యెరిమెయియా పర్నోవ్



*యెరిమెయియా పర్నోవ్ ఒక ప్రముఖ సోవియట్ రచయిత. అనేక సాహిత్యప్రక్రియల్లో అందెవేసిన చేయి: ఆయన వైజ్ఞానిక కల్పనా రచనలు. డిటెక్టివ్ కథలు, చారిత్రక నవలలు గుర్తింపు పొందాయి. ఆయన పాత్రికేయుడూ, పండితుడుకూడ.*

నాగేటి చాలులో విత్తులు చల్లుతూ, మనం చేస్తున్న పని భవిష్యత్తుకోసమన్న సంగతి గురించి ఆలోచించము. దైనందిక జీవితపు సందడీ, హడావుడీ, అలవాటయిన నిత్యకృత్యాలూమనల్ని అనుదిన కృషిలోని పరమార్థంగురించి ఆలోచించ నివ్వవు. కాని, యేది యేమైనా, ఈ విత్తులు ఉత్తరోత్తరా మొలకెత్తుతాయని మనకు ఖచ్చితంగా తెలుసు. యెందువల్లనంటే, ఆమని, వేసవి తరువాత ఆకురాలు కాలం వచ్చినట్లుగానే, విత్తిన తరువాత పంటకోసుకోవడం అనాదిగా జరుగుతూంది.

మన దూరదృష్టికి కనిపించేది వాస్తవంకావడం మామూలు విషయంగా భావించడానికి కారణ మిదేనేమో. అందువల్లనే మన దూరదృష్టికి అది కనిపించింది. కాని మనతరం పాలుకావలసి వచ్చిన ఒకానొక అనుభవం వల్ల, ఆనవాయితీగా వున్న విషయాలను మునుపటిలా కాక, మరోరకంగా చూస్తున్నాము. రేపన్నది సైతం యేఒకరికే కాదు, మనందకీ ఆవశ్యంగా రాకపోవచ్చునన్న విషాద కరసత్యం మనకు తెలిసివచ్చింది. శోచనీయమైన విషయమేమంటే యిది సహజమైన విషయంగా స్వీకరిస్తున్నాము.

గతతరాలకన్న మన తరానికి జీవితం కష్టభూ యిష్టమైనది — పాదార్థికంగాకాదు, ఆత్మికంగా. ఎందువల్లనంటే మానవజాతి ఆ చంద్రార్కంగా భూమ్మీద వుంటుందన్న దృఢవిశ్వాసానికి మనిషి తిలోదకాలు యివ్వడం మాటలా?

గతాన్ని మార్చడం మన చేతిలో లేదు. కాని భవిష్యత్తు అలా కాదు. దాన్ని మనం ప్రభావితం చేయవచ్చు — అయితే మానవాళిని నిర్ధూమధాం చేయగల ఆ భయంకర చర్య తీసుకోకముందే. ఆ చర్యను ఒకసారి తీసుకొన్న తరువాత దాన్ని వెనక్కు మళ్ళించడం సాధ్యం కాదనేది వెంటనే మనకు విదితం కాకపోవచ్చు. ఆ చర్య ఒక ప్రేలుడు సాధనంగా పనిచేసి, మన అదుపులోలేని యంత్రాంగాన్ని పనిలో పెట్టవచ్చు.

ఈ విశ్వంలో మనం మాత్రమే వున్నామేమో మనకు తెలీదు. ఈ సమస్య పరిశీలనలో నిమగ్న మైన శాస్త్రజ్ఞులు కేవలం తర్కబద్ధమైన ఆలోచన ద్వారా ఒక తెలివైన నిర్ధారణకు వచ్చారు. దాని సారాంశమేమిటంటే, అణుగతశక్తి హస్తగతంకావడంతో, యే "నక్షత్రనాగరికత" జీవితంలోనైనా సరే అతి కీలకమైన సమయం ఆసన్నమవుతుంది. ఆ నాగరికతల్లో యేవైనా ఆ అగ్నిపరీక్షలో నెగ్గాయా, అవి పారిశ్రామికానంతర శకంలోకి ప్రవేశించి, "తెలివైన ప్రపంచాల మహావలయం"లో కలిసి కట్టుగా వుంటాయి. వేరుమాటల్లో చెప్పాలంటే అవి "నక్షత్రాలు" అన్న పేరును సంపాదించా యన్నమాట. ఆపరీక్షలో నెగ్గనివేమో విశ్వంలోని నిశ్చేతనత్వ ప్రారంభదశలోకి తిరిగి వెళ్ళిపోయాయి. మనకు కూడ ఈ అగాధ అఖాత దృశ్యం కనిపించింది. దాని హిమశీతల వాతాహతికి మన ఒళ్ళు ఇంకా జలదరిస్తూనే వుంది. ఎందువల్ల నంటే మనమా అఖాతం అంచునుంచి ఒక్క అడుగుమాత్రమే వెనక్కు వేశాము. మానవజీవిత చరిత్రలో మొట్టమొదటి సారిగా మనం మానవుని చరిత్ర గతినే మార్చి వేసే ఒక కొత్త పుంతతొక్కాము.

ఒక్కసారిగా రెండురకాల అణ్వాస్త్రాలను నిర్మూలించ తలపెట్టాము. వాటికన్న విధ్వంసకరమైన అణ్వాస్త్రాలను సగానికి తగ్గించి వేసే మార్గాలను గురించి కూడా ఆలోచిస్తున్నాము. ఇదేమి సామాన్యమైన విషయంకాదు. ప్రళయాగ్ని గుండం నుంచి మనం వెనక్కు వేయనున్న రెండవ అడుగది.

ఇంగితజ్ఞాన విజయం కన్నా గొప్ప విజయం మానవాళికి వుండదు. ఈ విజయజ్యోతి వెలుగులు మరింత స్పష్టంగా పడుతున్న మూడవ సహస్రాబ్ది సమీపిస్తోంది. ''నక్షత్ర'' సంబంధమైన పరీక్షలో సాధ్యమైనంత త్వరగా ఉత్తీర్ణులు కావాలని రానున్న శతాబ్దం మనల్ని ఒత్తిడి పెడుతోంది. ఆ పరీక్షలో నెగ్గామంటే, కనీసం మనదృష్టిలోనైనా మనం ఒక మహోన్నతమైన నాగరికతలోకి అడుగిడటం సాధ్యమవుతుంది.

రెండు అగ్రరాజ్యాల నాయకుల సంతకాల వెనుక తెల్ల, పసుపు, నల్ల జాతులకు చెందిన 500 కోట్ల మానవుల అదృశ్య ఆమోదముద్రవుంది. తాము కాలల అనంతావరణలో పయనిస్తున్న అత్యల్పమైన భూమండలంలో నివసిస్తున్నామనీ, తమ మనుగడనూ లేదా మరణాన్ని నిర్ణయించేది ఒకే గమ్యంకాబట్టి, తాముకక్తబంధువులమనీ వీరెరుగుదురు.

ఈ మన అపూర్వ ఆరోహణా క్రమంలో యే ఒక్క ఆకస్మికఘటనైనా మన మనుగడను అంతం చేసి వుండేది. దాన్ని వెను దిరిగి చూచుకొని, వాషింగ్టన్‌లో సాధించినదానిపై దృష్టి మరల్చి, మాస్కోలో జరుగనున్న సమావేశానికి ఆశతో యెదురు చూద్దాం.

భవిష్యత్తును నిర్మించడానికి యెంతో కృషీ, పట్టుదలా అవసరం. నూతన ఆలోచనా సరళిని అంత ఆకర్షణీయంగా చేస్తున్న దేమిటి? అది గతానుభవంలోని అత్యుత్తమమయిన-దాన్ని తనలో జీర్ణించుకొని, మానవజాతినీ అదిపోగుచేసిన అమూల్యమైన విలువలనూ రక్షించేందుకు ధైర్యంగా ఒక కొత్త పంథా తొక్కింది.

అణుహేమంతం గురించి కంప్యూటర్లు లెక్క వేస్తుండగానే, మనకు అప్పుడే, జీవ్యావరణ దుస్థితి యెంత దారుణంగా వుందో శాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు. అంటార్కిటిక్‌పై గల ఓ జోన్ రంధ్రం, కాస్మిక్ కిరణాల నుంచి మనల్ని రక్షిస్తున్న పొరను చీల్చివేసే ప్రమాదంయేర్పడింది. మనం ఉన్నత మేధాపరీక్షలో నెగ్గగల పరిపక్వతను అందుకోక ముందే, సరిదిద్దరాని హాని మనకు మనమే చేసుకొన్నామా యేమి? అలా చేసుకోలేదని అనుకోదలచాను. కాని, యిప్పటికే బాగా కలుషితమైన సముద్రం — దాని ఉప్పు మనందరి రక్తంలో వుంది — మనకు యెంతో ఆందోళన కలిగిస్తోంది. మనకు ఊపిరితిత్తుల్లాంటి అడవులు రంపాలకు, ఆమ్లవర్షాలకు బలి అయ్యాయి. ప్రతిరోజూ యేదో ఒక క్రిమి, లేదా ఒక ఓషధి ఆమూలాగ్రంగా అదృశ్యమై పోతుంది. వాటితో పాటు వాటి ప్రత్యేక జన్యురూపాలు అంతరించి పోయాయి. అందువల్ల ప్రస్తుత, భావి రుగ్మతలనునయంచేసే అవకాశాలు లేకుండా పోతాయి. ప్రతి జబ్బుకు ప్రకృతి ఒక విరుగుడును ప్రసాదిస్తోందని పూర్వ ఋషులు చెప్పడానికి కారణం లేక పోలేదు. మనం అనాలోచితంగా ఈ విరుగుడులను రోజూ ధ్వంసం చేస్తున్నాం.

## భవిష్యత్తుకు పునాదులు

ఒక్క ఎయిడ్స్ వ్యాధినే తీసుకొందాం. మానవుడు శారీరకంగా, నైతికంగా యెంత దుర్బలుడో మనకు యిది మరొకసారి గుర్తుచేస్తోంది. మనకెదురవుతున్న ప్రమాదానికి యిదే మొదటి సూచనకాదు. మనం భూమిపై లేకుండా తుడిచి పెడుతున్నది కీటకాలను, మొక్క జాతులను, జంతువులను కాదు; మనల్ని మన భావి తరాలను తుడిచి పెడుతున్నాము. కాని ఈ విషయం మనతలకెక్కడం లేదు.

మనంగతంలో చేసిన తప్పులను మరచి పోకూడదు మన ప్రతి చర్యను పరీక్షిస్తూ, ఒక పద్ధతి ప్రకారం భవిష్యత్తు వైపుసాగాలి.

ఎయిడ్స్ వ్యాధికి వాక్సిన్‌ను మనం జన్యుయింజనీరింగ్‌లోనో, జీవశాస్త్ర సాంకేతిక శాస్త్రంలోనో రోగనిరోధక శాస్త్రంలోనో కనుగొంటామేమో. నోబెల్ బహుమతి గ్రహీత సుసుమా, టొనెగావా శరీర రోగనిరోధక శక్తి పని చేసే తీరును కనుగొన్నారు. అది పలురోగాల నుంచి మానవుణ్ణి విముక్తి చేయడంలో విజయం సాధించే సూచనలు కనిపిస్తున్నాయి. ఇలాంటి ఉదాహరణలు యెన్నైనా యివ్వగలను. ఇలాంటి ప్రతి ఒక్కటీ మనం మన ఉమ్మడి లక్ష్యాన్ని చేరుకొనే మార్గాలను, అంటే మన భవిష్యత్తును నిర్మించుకొనే మార్గాలను గురించి ఆలోచించేలా చేస్తుంది. వాతావరణాన్ని

కలుషితం చేయని కార్లు, సౌర విద్యుత్ ఘటాల వల్ల వెచ్చగా వుండే ఇళ్ళూ యిప్పటి ప్రమాణాలను బట్టి చాలా ఖర్చుతో కూడుకొన్నవి కావచ్చు. కాని సామూహిక ఉత్పత్తి వల్ల వీటి ధర తగ్గుతుంది. స్వచ్ఛమైన నీరూ, గాలీ చాలా అమూల్యమైనవి. గతానుభవం వల్ల ఆ విషయం తెలుసుకొన్నాము మునుపు దుస్సాధ్యమనుకొన్నవి సాంకేతిక ప్రగతి వల్ల సాధ్యమయాయి.

నూవర్‌కండక్టర్ల కల్పన వల్ల రోదసీసాంకేతిక శాస్త్రంలో విప్లవం రానుంది; నియంత్రిత అణు సంయోగానికి బాట యేర్పడింది. ప్రపంచ మహా సముదాల్లో ట్రిలియన్లకొద్దీ డ్యూటెరియం వున్నందు వల్ల, నియంత్రిత అణు సంయోగ పద్ధతితో పుష్కలంగా విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయవీలవుతుంది. నదులపై గల వందలాది డాములూ అడవులను, సాగుభూములను ముంచివేసిన రిజర్వాయర్లూ యిక అవసరం లేకుండా పోతాయి; సముద్రాలను కలుషితం చేస్తున్న చమురు గతస్మృతి కాగలదు. ఈ రోజు వ్యయభారంతో కూడుకొన్న వన్నీ రేవుకారుచౌక అవుతాయి. యురేనియం, ప్లూటోనియంల కేంద్రక విచ్ఛేదనంతో పోలిస్తే, అణు సంయోగంలో వుత్పత్తి అయ్యే రేడియో ధార్మిక ధూళి అతిస్వల్పం. ప్రమాద కరమైన రేడియోధార్మిక రద్దును పూడ్చి పెట్టే సమస్యను మనం యింకా పరిష్కరించలేదు. ఇక ముందు ఆ సమస్యే వుండదు.

కాని భవిష్యత్తులో యివన్నీ సుసాధ్యంకావాలంటే, మన ఆలోచనా సరళి మారాలి. నిరాయుధీకరణలాగానే, ఈ సమస్యల పరిష్కారానికి కూడ అంతర్జాతీయకృషి అవసరం భూమి, నీరు, గాలి మానవాళి వుమ్మడి సొత్తు కాబట్టి, అంతర్జాతీయ కృషి తప్పనిసరి అవుతోంది. పంచభూతాలకు సరిహద్దులను నిర్ణయించలేముగదా. ప్రపంచానికి కొత్త ఊపిరి పోసి, దాన్ని పునరుజ్జీవింపచేయాలంటే, నేడు అందులో వున్న అపారవిధ్వంసక అణ్వాయుధాలను నిర్మూలించవలసి వుంటుంది. ఈ ఉద్యమంలో సంప్రతింపులు జరిపే పక్షాలు సహజమిత్రులుగా వ్యవహరించాలి. భయం వల్ల సంభవించగల పరిణామ పరంపరకు, పరస్పర విశ్వాసం వీలు లేకుండా చేస్తుంది. ప్రపంచ వ్యాప్తి నిరాయుధీకరణ సమస్త జీవిత రంగాల మార్పునకు దారి యేర్పరుస్తుంది. ఉదాహరణకు, ఒకే సమాచారవ్యవస్థ, ఆహార వుత్పత్తికీ, అడవులను తిరిగి పెంచడానికి ఉమ్మడి కార్యక్రమం ఆచరణ సాధ్యమవుతుంది. సమాచార విజ్ఞాన శాస్త్రంలో, జీవసాంకేతిక శాస్త్రంలో విజయాలు, కృత్రిమంగా మాంసకృత్తులను ఉత్పత్తిచేయడానికి తోడ్పడుతాయి. ఇలాంటి భవిష్యత్తులోకి మానవాళి లంఘించేందుకు, నేడొక వేదిక సిద్ధమై వుంది. నౌకా, విమాన రవాణా, ప్రపంచ మహా సముద్రాల ప్రక్షాళన వంటి రంగాల్లోని నేటి తొలి అంతర్జాతీయ సహకారచర్యలు యిందుకు రుజువు.

## భవిష్యత్తుకు పునాదులు

ఎనర్జియారాకెట్ ప్రయోగం, అంతరిక్ష వేదికపై యూరీరొమనెంకో నెలల పర్యంతం నివసించడం కూడ భవిష్యత్తు అంకురాలే, ఇక్కడ ప్రతి ఒక్కటీ — రాజకీయ నిర్ణయాలు, శాస్త్ర, సాంకేతిక రంగ ప్రగతి; ఇంగిత జ్ఞాన దిగ్విజయం — ఒక దానితో ఒకటి ముడి పడి వున్నాయి. అంగారక గ్రహపరిశోధనపై నాసాకూ, సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్ర అకాడమీకీ మధ్యకుదిరిన ఒప్పందం వాషింగ్టన్ ఒప్పంద ప్రత్యక్ష ఫలితమే.

కాని అణ్వస్త్రరహిత ప్రపంచానికి బాట పడకుండా అడ్డుకునే శక్తులు పట్టుదలతో పనిచేస్తున్నాయి. ఐ.ఎన్.ఎఫ్. సంధిని వమ్ము చేయచూస్తున్నా యి.ఎస్.డి.ఐ. కార్యక్రమాన్ని వారు వదులుకోలేదు. గామాలేజర్ కిరణాలపై అమెరికాలో పరిశోధన జరుగుతున్నట్లు వార్తలు వచ్చాయి. ఇది "నక్షత్ర యుద్ధం"తో ముడిపడినదని పలువురి అభిప్రాయం. గామాలేజర్ ఉత్పత్తి చేయగల శక్తి, అమెరికాలోనేడున్న విద్యుత్ కేంద్రాల మొత్తం శక్తికన్న బిలియన్‌రెట్లు అధికం. దీన్ని ఉపయోగించుకొనే పద్ధతిని బట్టి యిది గొప్ప వరప్రసాదమైనా కావచ్చు లేదా భయంకరమైన శాపమైనా కావచ్చు.

అనంతకాశంలోని నక్షత్రవీధిలో మేధలయిన ప్రాణిలోకాలున్నాయోమోనని, అంతరిక్షభౌతిక శాస్త్రజ్ఞులు వెదుకుతున్నారు. మనం ఐ.రా.స ఏకగ్రీవనిర్ణయంపై అక్కడికి తొలిసారిగా గామా సంకేతాలను పంపగలిగితే బాగుంటుంది. కాని రోదసీ విధానంలో మనం ఇంగిత జ్ఞాన పరీక్షలో నెగ్గితే, అణ్వస్త్ర రహిత ప్రపంచం వాస్తవరూపంధరిస్తే, అప్పుడది జరుగుతుంది.

# భారతీయ వుపగ్రహం ఐ ఆర్ ఎస్-1 ఎ భూకక్ష్యలో

భారతీయ ఉపగ్రహం
ఐ ఆర్ ఎస్-1 ఎ

ఎం. ఛెర్నిషేవ్

దూరం నుండే పసిగట్టగల భారతీయ ఉపగ్రహం (ఐ ఆర్ ఎస్ ఎస్) మార్చి 17 నుండీ పని చేయడం ప్రారంభించింది.

మాస్కో మండలంలోని మెద్వెజీ ఓజెరా వుపగ్రహ నియంత్రణ కేంద్ర ప్రాంతంలో ఇండియన్ హౌస్ అనే భవనమొకటుంది.

ఈ హౌస్‌లోని పరికరాలు ఉపగ్రహాల గమనాన్ని నియంత్రించాయి. ఇవి భాస్కర వుపగ్రహాలు పంపే సమాచారాన్ని సేకరించి, విశ్లేషించాయి ప్రస్తుత కొత్త వుపగ్రహానికి సంబంధించిన పనిని కూడా మెద్వెజీ ఓజెరా కేంద్రం నిర్వహించింది. అయితే దాని కృషి ప్రథమదశకు మాత్రమే పరిమితమైంది. నిర్ణీత కక్ష్యలో యీ వుపగ్రహం ప్రవేశించిన తర్వాత దానిని వుపయోగించుకునే పనిని భారతీయ పక్షానికి అప్పగించడం జరిగింది.

భారతదేశ జాతీయ అంతరిక్ష కార్యక్రమం 1963లో ప్రారంభమైంది. వాతావరణరాకెట్లను ప్రయోగించడానికి అప్పుడు తుంబా వద్ద ఒక కేంద్రాన్ని నెలకొల్పారు తర్వాత వెంటనే సోవియట్ - భారత అంతరిక్షసహకారానికి పునాదులు వేయడం మొదలైంది. సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ, భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో) ఒక ఒప్పందంపై సంతకాలు చేశాయి. భారతీయ ప్రథమ పరిశోధనా వుపగ్రహం ఆర్యభటను సోవియట్ బూస్టర్ రాకెట్‌తో ప్రయోగించడానికి సంబంధించిన ఒప్పందమిది.

ప్రాయోగిక ప్రాతిపదికపై భూవనరులను పరిశీలించే రెండు సంయుక్త ప్రాజెక్టులను తర్వాత భాస్కర వుపగ్రహాల ద్వారా విజయవంతంగా అమలు పెట్టడం జరిగింది.

ప్రస్తుత కొత్త ఐ ఆర్ ఎస్ ఎస్‌ను ప్రాయోగిక ప్రాతిపదికపై ప్రయోగించలేదు. యిది భూవనరులను



*రాకెట్ బూస్టర్‌తో భారతీయ ఉపగ్రహ అనుసంధానాన్ని బైకొనూర్ అంతరిక్ష కేంద్రంలో పరిశీలిస్తున్న భారత, సోవియట్ నిపుణులు.*

పరిశోధించే వుపగ్రహ వ్యవస్థలో ఒక భాగం. యీ వ్యవస్థను శాశ్వతప్రాతిపదికపై నడుపుతారు. వాణిజ్య ప్రాతిపదికపై సోవియట్ యూనియన్ ప్రయోగించిన ప్రప్రథమ వుపగ్రహం యీ ఐ ఆర్ ఎస్ ఎస్. అయితే యిందుకు సోవియట్ యూనియన్ విధించిన చార్జీలు ప్రపంచ మార్కెట్‌లో ప్రస్తుతమున్న ధరలకన్నా చాలా తక్కువ.

ఐ ఆర్ ఎస్ ఎస్‌ను పూర్తిగా భారతదేశమే నిర్మించింది. అందులో సోవియట్ విడిభాగాలు లేవు. లోగడ ప్రయోగించిన వుపగ్రహాలకన్నా దీని బరువు మూడు రెట్లు యెక్కువ. అందువల్ల దీన్ని భూకక్ష్యలో ప్రవేశపెట్టడానికి మరింత శక్తివంతమైన వొస్తోక్ రాకెట్ అవసరమైంది. యీ వుప గ్రహం వల్ల యెన్నో ప్రయోజనాలను పొందవచ్చు. యిది నాలుగు స్పెక్ట్రల్ బేండ్స్‌పై పనిచేస్తుంది.

ఈ కొత్త వుపగ్రహాన్ని సోలార్ — సింక్రొనస్ కక్ష్యలో ప్రవేశపెడుతారు కాబట్టి ప్రతిరోజూ పూర్వార్థంలో అంటే వాతావరణంలో ధూళి, దుమ్ము అంతగా వుండని సమయంలో — దేశంలోని ఎంపిక చేసిన ప్రాంతాల ఫోటోలను యిది స్పష్టంగా తీయగలదు. దేశ భూభాగం మీదుగా యీ వుప గ్రహం పయనించినప్పుడల్లా 150 కిలోమీటర్ల వెడల్పయిన ప్రాంతాన్ని సర్వేచేస్తూ వెళ్లుతుంది.

సోవియట్ - భారత అంతరిక్ష సహకారం కాలపరీక్షకు తట్టుకొని నిల్చింది. యీ సహకార రూపాలు నానాటికీ మరింత వైవిధ్యాన్ని సంతరించుకుంటున్నాయి. సంయుక్త అంతరిక్షయాత్ర యీ సహకార పరిణామానికి గొప్ప దోహదం చేసింది. కక్ష్యలో పరిభ్రమిస్తున్న శాల్యూట్ - 7 అంతరిక్షవేదిక నుండి భారత వ్యోమగామి ఆర్. శర్మా ఆయనతో పాటు సోవియట్ వ్యోమగామీ భారత భూభాగానికి సంబంధించిన అత్యంత నాణ్యమైన ఫోటోలు తీశారు. యీ ఫోటోలవల్ల ఏడు బిలియన్ల రూపాయలకు పైగా ఆర్థిక ప్రయోజనం ఒనగూడింది. భారత జాతీయ ఆర్థిక వ్యవస్థ ప్రయోజనాల దృష్ట్యా ఆచరణాత్మక ఫలితాలను సాధించే ఒక నూతన దశ - భూవనరులను కనుగొనే యీ అంతరిక్షవ్యవస్థ

# అంతరిక్ష పరిశోధనలో సోవియట్, భారత సహకారం

వీక్టర్ సాల్స్కీ, క్యాండిడేట్ సైన్స్, సోవియట్ అంతరిక్ష సంస్థ

ఐ ఆర్ ఎస్ - 1 ఎ ప్రయోగం—యిది అంతరిక్ష పరిశోధనలో సోవియట్ భారతసహకారాభివృద్ధిలో నూతన అంజ. యీ సహకారం 1964 లో ప్రారంభమైంది. అప్పుడు తుంబా రాకెట్ ప్రయోగ కేంద్రాన్ని నెలకొల్పడంలో భారత దేశానికి సోవియట్ యూనియన్ సహాయపడింది; భారతదేశానికి ఒక హెలీకాప్టర్‌ను, ఒక కంప్యూటర్‌ను, వాతావరణ పరిశోధన రాకెట్లను సమ కూర్చింది. భారతదేశ ఆర్యభట వుపగ్రహాన్ని అంతరిక్ష్యంలోకి సోవియట్ బూస్టర్ రాకెట్ ప్రయోగించింది. యిందులో సోవియట్ సౌర, రసాయన బ్యాటరీలు, యింకా యితర పరికరాలు వున్నాయి. భారతదేశ వుపగ్రహాలు భాస్కర - 1, భాస్కర - 2 లను కూడా సోవియట్ బూస్టర్ రాకెట్లు కక్ష్యలో ప్రవేశ పెట్టాయి. భారతదేశ ప్రప్రధమ వ్యోమగామి రాకేష్‌శర్మా 1984 లో సోవియట్ అంతరిక్ష వేదిక అయిన శాల్యూట్ - 7లో అంతరిక్షయానం చేశారు. అది అంతరిక్ష అన్వేషణకు సంబంధించి సోవియట్ భారత భాగస్వామ్యంలో ప్రధాన ఘటన.

ప్రస్తుతం భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో), సోవియట్ గ్లావ్‌కోస్మోస్ (అంతరిక్షసంస్థ) నిపుణులు యీ సహకారంలో గల నూతన అవకాశాలను చర్చిస్తున్నారు. యిందులో సోవియట్ వుపగ్రహంలో భారత ఎస్ హెచ్ ఎఫ్ పరికరాలను అమర్చడం; భారతదేశం కోసం సోవియట్ అంతరిక్షశోధన, ఆపద్రక్షణ వ్యవస్థల వినియోగం లాంటివి వున్నాయి.

అంతరిక్ష సాంకేతిజ్ఞతలు; అంతరిక్షయానం; కమ్యూనికేషన్స్, టెలికాస్టింగ్ యింకా భారతదేశం కోసం సోవియట్ మీర్ అంతరిక్ష కేంద్రంలో ప్రయోగాలు, వైవిధ్య పూరితమైన కార్యకలాపాలు — వీటిలో సోవియట్ - భారత సహకార పద్ధతులను రూపొందిస్తున్నారు. సోవియట్ బూస్టర్ రాకెట్లతో భారతీయ వుపగ్రహాల ప్రయోగాన్ని కొనసాగించాలని ఉభయ దేశాల నిపుణులు అభిప్రాయ పడ్డారు.

ఈ విధంగా అంతరిక్ష పరిశోధనలో సోవియట్-భారత సహకారం నూతనదశలో ప్రవేశించింది; భారతదేశం తన ఆర్థిక, విజ్ఞానశాస్త్ర ప్రయోజనాలకోసం సోవియట్ అంతరిక్ష శక్తిసామతలను మరింత సమగ్రంగా వినియోగించుకోగలుగుతుంది. కృత్రిమ భూవుపగ్రహాలు అందజేస్తున్న సమాచారాన్ని యీనాడు 900 లకు పైగా సోవియట్ సంస్థలు వినియోగించుకుంటున్నాయి. యీ సమాచారాన్ని వినియోగించు కుంటున్న సంస్థలసంఖ్య పెరుగుతోంది. త్వరలోనే యిది 2,000 లకు చేరుకుంటుందని సోవియట్ శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

వనరుల అన్వేషణ వ్యవస్థను సోవియట్ యూనియన్‌లో ప్రకృతి వనరుల అధ్యయనానికి వుపయోగిస్తున్నారు. యీ వ్యవస్థలో మూడురకాల ఉపగ్రహాలున్నాయి; అవి ఫొటోగ్రఫీ భూమ్యుపరితల, సముద్ర ఉపరితలాల పరిస్థితిని నమోదుచేసే వుపగ్రహాలు. అంతరిక్షస్థిత ఫొటోగ్రఫీ సహాయంతో ప్రకృతి వనరులను కనుగొని నమోదుచేస్తారు. ఆర్థిక కార్యకలాపాలను నియంత్రిస్తారు; ప్రమాదకరమైన ప్రకృతి బీభత్సాలను పసిగడుతారు; పటాలను రూపొందిస్తారు. వనరుల అన్వేషణ వ్యవస్థ తాలూకు వుపగ్రహాలు ఏటా ఒకమిలియన్ ఫొటోగ్రాఫులను యీ సమాచారం పట్ల ఆసక్తిగల సంస్థలకు అందజేస్తాయి.

సోవియట్ వాతావరణ పరిశోధక అంతరిక్షసంస్థ ఇప్పటికే అనేక సంవత్సరాలుగా పనిచేస్తున్నది

వాతావరణ పరిస్థితిని తెలుసుకోడానికి తత్సంబంధిత వుపగ్రహాలు అందజేసే సమాచారం తప్పనిసరి. సముద్రాల యితర మండలాల వాతావరణ పరిస్థితిని తెలుసు కోడానికి వాతావరణ పరిశోధన కేంద్రాల సముదాయం యెంతో అవసరం. మంచును, మంచు పొరలను గురించి తెలుసు కోడానికీ, విమాన ప్రయాణాలకు తోడ్పడడానికీ, వాణిజ్యనౌకల, చేపలువట్టే నౌకల ప్రయాణానికి వుపయుక్తమైన మార్గాలను యెంచుకోడానికీ వాతావరణ పరిశోధనా వ్యవస్థ వుపగ్రహాలను వినియోగించుకుంటున్నారు.

ఇప్పుడు మెటీరో - 2 రకానికి చెందిన రెండోతరపు వాతావరణ పరిశోధక వుపగ్రహాలను సోవియట్ యూనియన్‌లో వినియోగించు కుంటున్నారు; మెటీరో - 3 అనే కొత్త వుపగ్రహాల పరీక్షలను నిర్వహిస్తున్నారు. ప్రస్తుత వుపగ్రహాల కన్నా యీ కొత్త వుపగ్రహం యెక్కువ కాలం మన్నుతుంది. ఇన్‌ఫ్రారెడ్ పరిధిగల అధునాతన పరికరాలు యిందులో వున్నాయి. యివి 1,250 కిలో మీటర్ల యెత్తునగల కక్ష్యలో పరిభ్రమించ గలవు. భూమ్యుపరితలం విడుదలచేసే ఉష్ణోగ్రతను మెటీరో - 3 కొలువగలదు; మేఘాల ఎగువహద్దు యెత్తును అంచనా వేయగలదు.

సోవియట్ యూనియన్‌లో వుపగ్రహ కమ్యూనికేషన్ వ్యవస్థను యిరవై యేళ్ళ క్రితం యేర్పాటు చేశారు. యిది యెంతో లాభదాయకమైనదిగా రుజువైంది. సోవియట్ యూనియన్‌లో ప్రస్తుతం మోల్నియా రకం కమ్యూనికేషన్ వుపగ్రహాలను వుపయోగిస్తున్నారు. వీటిని దీర్ఘవృత్తీయ కక్ష్యల్లో ప్రవేశపెట్టారు. భూభ్రమణాన్ని బట్టి అంతరిక్షంలో స్థిరంగా వుండే ఎక్రాన్, రాదుగా, గొరిజోన్ట్ వుపగ్రహాలను వుపయోగిస్తున్నారు. పదకొండు టి.వి. ఛానల్స్ గ్రహణకు, ట్రాన్స్‌మిషన్‌కు; బహుళఛానల్ టెలిఫోన్ టెలిగ్రాఫ్ కమ్యూనికేషన్స్‌కు; మానవ సహిత అంతరిక్ష వేదికలను నియంత్రించే నౌకలతో కమ్యూనికేషన్స్‌కు సోవియట్ కమ్యూనికేషన్స్ వుపగ్రహాలు హామీ కల్పిస్తున్నాయి. సోవియట్ అంతరిక్ష కమ్యూనికేషన్ వ్యవస్థ తాలూకు భూస్థిత భాగంలో ఐదు సెంట్రల్ కమ్యూనికేషన్ కేంద్రాలు, సుమారు 100 స్థిర, 1000 కి పైగా సంచార టెలివిజన్ గ్రహణ కేంద్రాలు వున్నాయి.

టీ వి రిట్రాన్స్‌మిషన్‌ను మరింత విస్తృత పర్చడానికి ఎస్ టి వి - 12 అనే మరో వుపగ్రహ వ్యవస్థను ప్రవేశపెట్టదలిచారు. అది అంతర్జాతీయ ఫ్రీక్వెన్సీ బేండ్‌లో పనిచేస్తుంది. భూస్థిర కక్ష్యలో ఐదు వుపగ్రహాల స్థాపనకు, 70 ఫ్రీక్వెన్సీ ఛానల్స్‌కు అంతర్జాతీయ ఒప్పందం ప్రకారం సోవియట్ యూనియన్‌కు అనుమతి వుంది.

జియోడెసిక్ అధ్యనాల కోసం 1962 నుండి సోవియట్ వుపగ్రహాలను ముమ్మరంగా వినియో గిస్తున్నారు. భూమిపై జలాల్లోగల వస్తువుల వునికిని తెలుసుకోడానికి జియోడెసిక్ కొలతలను వుపయోగిస్తారు. వుదాహరణకు ప్రపంచసముద్రాల్లో నౌకలు యెక్కడున్నా సరే 80-100 మీటర్ల తేడా వాటి వునికిని యీ కొలతల ద్వారా కనుగొనవచ్చు. దీనివల్ల నౌకాయానాల ఆర్థిక సామర్థ్యం, భద్రత పెరుగుతుంది. నౌకాయానాల్లోని లోపాలవల్ల ప్రతిసంవత్సరం ప్రపంచంలో సుమారు ఒక మిలియన్ టన్నుల బరువుగల నౌకలు యెన్నో మునిగిపో తున్నాయి.

ఉపరితలం పైగల వస్తుల జాడను తెలుసు కోడానికి అంతర్జాతీయ కోస్పాస్ - సరత్ అంతరిక్ష వ్యవస్థ వుంది. దాని వుపగ్రహాలు ప్రమాదాల్లో చిక్కుకొన్న నౌకలను, విమానాలను కాపాడడానికి తోడ్పడుతున్నాయి. కోస్పాస్ - సరత్ వ్యవస్థలో సోవియట్ యూనియన్, అమెరికా, ఫ్రాన్స్, కెనడా, తదితర దేశాలున్నాయి. యీ వ్యవస్థవల్ల యిప్పటికే 1000 కి పైగా ప్రాణాలను కాపాడడం సాధ్యమైంది. అంతర్జాతీయ అంతరిక్ష సహకార సామర్థ్యానికి కోస్పాస్-సరత్ వ్యవస్థ యేర్పాటు సుస్పష్టమైన తార్కాణం అంతరిక్ష సాంకేతిజ్ఞతను యితరత్రా అనువర్తించే భాగస్వామ్యాన్ని విస్తృతపర్చడానికి సోవియట్ యూనియన్ సుముఖం. వుదాహరణకు సోవియట్ నౌకాయన పద్ధతుల సాంకేతిక పరామితులను అమెరికన్ పద్ధతులతో అనుసంధించడం. వీటిని సంయుక్తంగా వినియోగించుకునే అంశంపై చర్చ జరుగుతోంది.

*అంతరిక్ష పరిశోధనలో సోవియట్-భారత సహకారం నూతన దశలో ప్రవేశించింది. భారతదేశం తన ఆర్థిక,విజ్ఞాన శాస్త్ర ప్రయోజనాలకోసం సోవియట్ అంతరిక్షశక్తి స్తోమతలను మరింత సమగ్రంగా వినియోగించుకో గలుగుతుంది. కృత్రిమ భూవుపగ్రహాలు అందజేస్తున్న సమాచారాన్ని యీనాడు 900లకు పైగా సోవియట్ సంస్థలు వినియోగించుకుంటున్నాయి. యీసమాచారాన్ని వినియోగించుకుంటున్న సంస్థల సంఖ్య పెరుగుతోంది. త్వరలోనే యిది, 2000 లకు చేరుకుంటుందని సోవియట్ శాస్త్రజ్ఞుల అభిప్రాయం.*

పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్

# సోవియట్ యూనియన్

# పునర్ వ్యవస్థీకరణ కార్యక్రమంలో కొత్తదశ


**వలేరి ఫిలిపోవ్ పి.హెచ్.డి.**

*సోవియట్ యూనియన్, ప్రభుత్వ ప్రణాళికా కమిటికి చెందిన ప్రణాళికా రచన, నిర్దేశక ప్రమాణాల పరిశోధక సంస్థ.*


సోవియట్ యూనియన్ సమస్త జీవితరంగాల పునర్ నవీనీకరణ కార్యక్రమాన్ని, అంటే పెరిస్త్రోయికాను అమలు జరప నారంభించింది. ఇది గొప్ప బాధ్యతలు, చిక్కులు, వైరుధ్యాలుగల దశ. సామాజిక, ఆర్థిక ప్రగతితో ముడివడి వున్న ఈ పెరిస్త్రోయికా కృషి పెంపొందుతూంది. కొత్త సాధన సముదాయ సహాయంతోనూ, ఆర్థిక మార్పులకు న్యాయశాస్త్ర ప్రాతిపదిక అయిన "ప్రభుత్వ పరి శ్రమాది సంస్థల చట్టం" తోడ్పాటుతోనూ, మేనేజిమెంటు యంత్రాంగాన్ని మనం పునర్వ్యవస్థీకరించాలనుకుంటున్నాం.

ఈచట్టం పెరిస్త్రోయికాను గురించిన భావనను నిర్దేశిస్తోంది. అంటే సోవియట్ ఆర్థిక వ్యవస్థనూ, దానిలోని మౌలిక విభాగమైన కర్మాగారాది సంస్థనూ పని చేయించే యంత్రాంగం గురించిన భావాలను ఈ చట్టం నిర్దేశిస్తుందన్నమాట. మేనేజిమెంటు వ్యవస్థలో విప్లవకరమార్పులు రావాలనే వారూ వున్నారు; అదొక పరిణామ క్రమ పర్యవసానంగా రూపుదిద్దుకోవాలనేవారూ వున్నారు. పైన పేర్కొన్న చట్టం ఈ ఉభయుల భావ ఘర్షణ ఫలితం; వారి మధ్య కుదిరిన ఒక విధమైన రాజీ. అందువల్ల దానిలో పరస్పర వైరుధ్యాలున్నాయి. స్వవచో వ్యాఘాతాలున్నాయి. కాని అది పెరిస్త్రోయికా అనుకూలుర, ప్రతికూలుర బలాబలాలను ప్రతిబింబిస్తోంది. కొన్ని బలహీనతలున్నప్పటికీ అది తదుపరి పురోగమనానికి ఒక దృఢమైన న్యాయశాస్త్ర ప్రాతిపదిక.

మేనేజమెంటుకు సంబంధించిన మౌలిక

పద్ధతులను, రూపాలను పునర్నిర్మించేందుకు వుద్దేశించిన నిర్ణయ సముచ్చయానికి పునాది ఈ చట్టమే. ఈనిర్ణయాలన్నీ కలసి పెరిస్త్రోయికాకు వెనుపూసగా వుంటున్నాయి. అవి నేటి అవసరాలకు అనుగుణమైన మేనేజమెంటు యంత్రాంగానికి మారేందుకు ప్రాతిపదిక; సమర్థమైన సోషలిస్టు మేనేజమెంటు వ్యవస్థను రూపొందించేందుకు ఒక సవివరమైన కార్యక్రమం.

ఈశాసనం 1988 జనవరి 1న అమల్లోకి వచ్చింది. దీని ప్రాతిపదికపైనా, తత్సంబంధిత ప్రమాణాలను నిర్దేశించే చట్టాల ప్రాతిపదికపైనా కొత్త మేనేజిమెంటు యంత్రాంగానికి మారటమే పెరిస్త్రోయికా ప్రస్తుత 'రెండవ దశలోని సారభూతఆంశం.

కొత్త మేనేజిమెంటు వ్యవస్థను, యంత్రాంగాన్ని మనం యేదృష్టితో చూస్తున్నాము? ఉరవడినందుకొంటున్న ఈ సంస్కరణ లక్షణాలేమిటి?

జరుగుతున్న మార్పు విప్లవకరమైనదని నేను నొక్కి చెప్పదలచాను. తలకిందులుగావున్న ప్రస్తుత మేనేజమెంటు వ్యవస్థను ఈ సంస్కరణ దాని కాళ్లపై నిల్పుతుంది. ఇంతకాలం వేళ్ళుదన్నివున్న పాత అభిప్రాయాలను, యిందుకోసం పునస్సమీక్షించ వలసి వచ్చింది. కీలకమైన ఆర్థిక 'ప్రక్రియలు జరిగేది, సరుకులను వుత్పత్తి స, లేదా సేవలందించే కర్మాగారాది సంస్థల్లోనే యివి మేనేజిమెంటు పైస్థాయిలో జరగవనే వాస్తవాన్ని గుర్తించడం అవసరమైంది. ఫలానావారు పౌర అస్తికి బాధ్యులనీ, మేనేజిమెంటు వ్యవస్థలో కర్మాగారాది సంస్థలకుగల స్థానంమీద దేశ సామాజిక, ఆర్థిక ప్రగతి ఆధారపడి ఉందనీ అంగీకరించడం తప్పనిసరి అయింది.

ఈకొత్త దృక్పథం కారణంగా, దేశ అర్థిక కార్యకలాపాలను నడపడంలో పాల్గొనడానికి కర్మాగారాది సంస్థలకు గట్టి హక్కులభించింది. ఇవి సోషలిస్టు వుత్పాదక సంస్థలన్న అవగాహన, వీటిపట్ల ఈనూతన దృక్పధానికి సైద్ధాంతిక ప్రాతిపదిక. ।న్యాయశాస్త్ర దృష్టిలో ఇవి పౌరఆస్తికి బాధ్యత వహించేవి నిధుల స్వయంసేకరణకు, స్వయంమేనేజిమెంటుకు అనువైన స్వతంత్ర కార్యకలాపాల్లో అవి పాల్గొంటాయి.

ప్రభుత్వ ఆర్డర్లను, నిర్ణీత ప్రమాణాలను,

284.5 మిలియన్లు
ఇది 1988 జనవరి 1
నాటి సోవియట్
యూనియన్ జనాభా

70 యేళ్లు
ఇది సోవియట్ యూనియన్‌లో
సగటు ఆయు పరిమితి

131 మిలియన్లు
ఇది సోవియట్ యూనియన్‌లో
కార్మికుల, వుద్యోగుల,
సమిష్టి క్షేత్ర రైతుల సంఖ్య



పలేరి ఫిలిపోవ్

మార్కెట్ ధరలను ప్రాతిపదికగా చేసుకొని కర్మాగారాది సంస్థలు తమ ఉత్పత్తి లక్ష్యాలను ఉత్పత్తి కార్యక్రమాలను ఆమోదించాయి.

పరిశ్రమాది సంస్థలు తమ ప్రణాళికలను అమలు జరపడం ప్రారంభమయింది. ఈ సంస్థలు వాస్తవంలో ఆర్థికంగా స్వతంత్రంకావడానికి కావలసిన హక్కులను ఈసంస్థలకు సంస్కరణలు యిస్తున్నాయి. యిటీవలవరకు జరిగినట్లు, అవి వనరుల విషయంలో లక్ష్యాలను నిర్దేశించుకోవు. తమ ఖర్చులను, ఫలితాలను, ఆదాయాలను లెక్కవేసుకొంటాయి. తమ ఆస్తులతో అవి తమ తమ భాగస్వాముల ఆర్థిక సంక్షేమానికి ప్రభుత్వ అర్థిక సంక్షేమానికి బాధ్యత వహించవలసి వుంటుంది. వేరు మాటల్లో చెప్పాలంటే అవి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, స్వయం మేనేజిమెంటును వినియోగించుకోవడం నేర్చుకోవాలి.

ఉత్పత్తిదారీ సంస్థలు తమ వ్యవహారాలను స్వయంగా నిర్వహించు కోవడం ఈసంస్కరణ లక్ష్యం. అంటే తమ కర్మాగార సహ యజమానులుగా కార్మికులు ఉత్పత్తి, సామాజిక వ్యవహారాలను స్వయంగా నిర్వహిస్తారన్నమాట; పైనుంచి వుత్తర్వుల కోసం వేచివుండరు. కర్మాగారం డైరెక్టరును, యితర కార్య నిర్వాహకులను యెన్నుకోవడం ఈ స్వయం నిర్వహణకు ప్రోద్బలమిస్తుంది.

కనీస మదుపులతో నాణ్యమైన సరుకులను, పోటీకి నిలబడగల సరుకులను గిరాకీకి తగ్గట్లు సంఘరా చేయడంలో కర్మాగారాలు పరస్పరం పోటీపడతాయని చట్టం చెబుతోంది. వేరు మాటల్లో చెప్పాలంటే ప్రభుత్వం ఉత్పత్తిలో పోటీని ప్రోత్సహిస్తుంది.

ఉత్పత్తిదారులకు ఫెడరల్ ప్రభుత్వానికీ మధ్య సంబంధాలనూ, కర్మాగారాదులను నడిపే మార్గదర్శ సూత్రాలనూ నేడు పునస్సమీక్షిస్తున్నారు. అట్టడుగు సంస్థలు సమర్థంగా పనిచేయడానికి అత్యనుకూల పరిస్థితులను సృష్టించడమే మేనేజిమెంటు పద్ధతులను మార్చే ప్రస్తుత సంస్కరణ లక్ష్యం.

గిరాకీకీ అనుగుణంగా సరుకులను పూర్తిగా, సకాలంలో సరఫరా చేయడం ప్రతి ఉత్పత్తిదారీ సంస్థ వ్యూహమవుతూంది.

పెరిస్త్రోయికా ప్రస్తుత దశలో, ఈసంస్కరణకు దోహదం చేసేందుకు శాయశక్తులా పాటుపడటం అవసరం. యెందువల్లనంటే ఈ సంస్కరణకు అన్నిదిశలనుంచి ప్రతిఘటన యెదురవుతూంది. మొదటి విషయం, మేనేజిమెంటు విధులనూ, ప్రణాళికా రచనకు సంబంధించిన విధులనూ ఉత్పత్తిదారులకు బదలాయించడం యింకా మందకోడిగా సాగుతోంది. మేనేజిమెంటు పైస్థాయిలోనివారు హుకుము జారీచేసే పద్ధతికి మనం స్వస్తిచెప్పక పోతే, పెరిస్త్రోయికా పురోగమించదు. సంబంధిత సంస్థలకు యిది యెంత బాధకలిగించినా సరే ఈపద్ధతి అంతం కావలసిందే.

రెండవ విషయం; ఆర్థిక సంస్కరణకు, మరింత ఖచ్చితంగా చెప్పాలంటే దాని సామాజిక పర్యవసానాలకు వచ్చిన ప్రతి స్పందనలు బహువిధంగా వున్నాయి. దీనికి కారణమేమిటంటే, ఉత్పత్తిదారీ సంస్థలచే నిధుల స్వయంసేకరణ, పనిపై ఆధారపడిన వేతనాలు ఒక కొత్త పరిస్థితికి, ముఖ్యంగా ఆదాయాలమధ్య అంతరం మరింత పెరగడానికి దారి తీస్తోంది. పనితో ముడిపడిన వేతనాలు అసంగతమైన వినియోగదారీ మనస్తత్వానికీ, కొని సమష్టి శ్రామిక

సంస్థలు మార్కెట్‌లోని వస్తువులను హస్తగతం చేసుకోవడానికి దారి తీయవచ్చునని అనేకులు భయపడుతున్నారు.

కాని ధరలు, పరపతి, నిర్ణీత ప్రమాణలవంటి గట్టి సాధనాల సహాయంతో ప్రభుత్వం యిటువంటి దురాచారాలను అదుపుచేయగలదు. ప్రభుత్వం సమర్థతకు ప్రోద్బలమిచ్చి, అన్యాయమైన ఉన్నతాదాయాలను అదుపులో వుంచుతుంది.

సమర్థులకు ఈసంస్కరణ అనుకూలిస్తుంది. కాని నష్టపోయేవారి మాటేమిటి?

నష్టపోయేవారికి బడ్జెట్‌నుంచి సబ్సిడీలను చెల్లించే మునుపటి పద్ధతికి ఈసంస్కరణ వ్యతిరేకం. సబ్సిడీ పద్ధతి బాగా పనిచేసేవారి జేబులు కొట్టడమే. సంస్కరణవల్ల నష్టపోయే ఆయా సంస్థలను పారిశ్రామిక శాఖో, లేదా బ్యాంకులో ఆర్థికంగా ఆదుకోవచ్చు. కాని ఈ బయటి సహాయంతో కూడా పనిలో మెరుగుదల చూపని సంస్థలను పునర్నిర్మింపడం లేదా మూసివేయడం జరుగుతుంది. వాటి సిబ్బందికి వేరే వుపాదులు చూపే బాధ్యత ప్రభుత్వం తీసుకొంటుంది.

సోవియట్ ఆర్థిక వ్యవస్థ కీలకమైన దశలో ప్రవేశించింది. కొత్త మేనేజిమెంటు యంత్రాంగం యింకా రూపుగొంటున్న స్థితిలో పాత, కొత్త మేనేజిమెంటు వ్యవస్థలు కొన్నాళ్ళు సహజీవనం చేస్తూ ఘర్షణ పడుతూంటాయి. విధాన నిర్ణేతలు వీటిపట్ల పూర్వాచారవిరుద్ధమైన వైఖరులు అవలంబించవలసి వుంటుంది.

# సోవియట్ యూనియన్ సామాజిక గణాంక వివరాలు

ఇతర దేశాలతో పోల్చి చూచినపుడు సోవియట్ యూనియన్ జనాభా పెరుగుదల సగటు స్థాయిలో వుంది. చాలా కాలంవరకూ యీ పెరుగుదల 0.9 శాతం వుంది. యిప్పుడు కొంత మెరుగైంది. నిరపేక్ష లెక్కల్లో చెప్పాలంటే 1986, 1987 లలో సాలుకు సుమారు 2,900,000 చొప్పున జనాభా పెరిగింది. 1988 జనవరి 1 నాటికి దేశ జనాభా 284,500,000 కు చేరుకుంది.

జనాభా పెరుగుదల సోవియట్ యూనియన్‌కు అనుకూలమైన ధోరణి. జనాభా పెరుగుదలను ప్రభుత్వం ప్రోత్సహిస్తోంది. ప్రభుత్వం నానాటికీ తల్లులకు, పెద్దకుటుంబాలకు సహాయాన్ని సాధ్యమైనంతగా పెంచుతున్నది. ఫలితంగా జననాల రేటు పెరిగింది. 1980లో జననాల సంఖ్య 4,900,000 వుండగా 1987లో 5,600,000 లకు పెరిగింది.

అదే సమయంలో జీవన నాణ్యత పెరిగినందువల్ల మరణాల సంఖ్య తగ్గింది. 1984లోకన్నా మరణాలు గత రెండు సంవత్సరాల్లో 200,000 తగ్గాయి. సగటు ఆయుపరిమితి 70 యేళ్ళకు చేరుకుంది.

1987లో సోవియట్ యూనియన్‌లో అర్హతలకు తగ్గ పూర్తిస్థాయి వుద్యోగాలను సమకూర్చడం జరిగింది. యీదేశంలో దాదాపు 60 యేళ్ళనుండీ నిరుద్యోగంలేదు. పారిశ్రామిక కార్మికులు, ఆఫీసు సిబ్బంది, సమిష్టి క్షేత్ర రైతులు 131 మిలియన్లకు పైగా వున్నారు.

మరింత వుత్పాదకతను సాధించడానికి ప్రజలు కృషిచేస్తున్నారని నివేదికలు తెలియజేస్తున్నాయి. వుత్పత్తిలో యావత్తు పెరుగుదలను (పరిశ్రమల్లో 3.8 శాతం, వ్యవసాయంలో 0.2 శాతం) అధిక శ్రమ వుత్పాదకత ద్వారా సాధించారు. వుత్పత్తిరంగంలో మొదటిసారిగా కార్మికుల సంఖ్యను తగ్గించడం జరిగింది. పరిశ్రమల్లో 140,000 మంది కార్మికులు మిగులుగా తేలారు. ప్రస్తుతం యీమిగులు కార్మికులకు వుద్యోగాలు సమకూర్చడం కష్టమేమీ కాదు. యితర పరిశ్రమల్లో, నిర్మాణ, వ్యవసాయ రంగంలో మిలియన్లాది వుద్యోగాలు ఖాళీగా వున్నాయి.

ప్రస్తుతం అమలు వరుస్తున్న అర్థిక సంస్కరణల ఫలితంగా జరిగే మార్పులవల్ల స్వరూప సంబంధమైన మార్పులవల్ల భవిష్యత్తులో పరిస్థితి మరింత జటిలమౌతుంది.ప్రస్తుత పంచవర్ష ప్రణాళికా కాలంలో ఒక వుత్పత్తి రంగంలోనే మూడు మిలియన్ల మంది మిగులుగా తేలవచ్చు. మేనేజ్‌మెంట్ యంత్రాంగంలోని సిబ్బందిలో యెక్కువ మందిని తొలగించడం 1988 లోనే ప్రారంభమౌతుంది.

వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకొని మిగులు సిబ్బందిని కొత్త వుద్యోగాల్లో చేర్చేందుకు, వారికి తిరిగి శిక్షణ యిచ్చేందుకు, వృత్తిసంబంధమైన సలహాలిచ్చేందుకు యిప్పుడే జాతివ్యాప్త ప్రభుత్వ వ్యవస్థను యేర్పాటు చేయడం జరుగుతోంది. అన్ని పట్టణాలకు, జిల్లాలకు యీవ్యవస్థలు వుంటాయి.

పనినుండి తొలిగించిన మిగులు కార్మికులకు వుద్యోగాలెక్కడ లభిస్తాయి?

మొదటిది; కొత్త పరిశ్రమాది సంస్థల్లో; కొత్త పరిశ్రమల్లో- రెండవది; వ్యాపారరంగంలో, ప్రజా సేవల రంగంలో, తగినన్ని సదుపాయాలు లేని విశ్రాంతి, వినోద యాత్రల రంగంలో వుద్యోగాల సంఖ్యను గణనీయంగా పెంచుతారు. సహకార రంగంలో, వ్యష్టిశ్రమరంగంలో పనిచేస్తున్న వారి సంఖ్యను పెంచుతారు.

జనాభాకు సరకుల, సేవలకు సంబంధించిన పరిస్థితిని గణింకశాఖ తన నివేదికలో పేర్కొంది. ఎగుమతులవల్ల లభించే విదేశీ మారక ద్రవ్యం తగ్గిపోయినందున (ముఖ్యంగా ప్రపంచ మార్కెటులో చమురు యితర యిందనాల ధరలు పడిపోయినందువల్ల) వినిమయ సరకులతో సహా దిగుమతులను తగ్గించుకోవాల్సి వచ్చింది. యిది అందరికీ తెలుసు. దీనివల్ల దేశంలోని చిల్లర వర్తక టర్నోవర్‌పై వ్యతిరేక ప్రభావం పడింది. 1987లో సారాయి అమ్మకాలను 13 శాతం తగ్గించడం జరిగింది. దీనివల్ల కూడా—యిది సమాజానికి మేలైనదే - చిల్లర వర్తక టర్నోవర్ తగ్గింది. వోడ్కా అమ్మకాలవల్ల ప్రభుత్వానికి లభించే ఆదాయం తగ్గిపోయిన మాట నిజమే.

ఆహార పదార్థాల వుత్పత్తుల, గిరాకీ వున్న వినిమయ సరకుల వుత్పత్తిని పెంచడం ద్వారా తగ్గిపోయిన ఆదాయాన్ని పెంచుకోడానికి తీసుకున్న చర్యలు సమర్థనీయమైనవే. ముఖ్యమైన వస్తువుల (మాంసం, వెన్న, వాషింగ్ మెషీన్లు, టేప్‌రికార్డర్లు, కార్లు) అమ్మకాలు గణనీయంగా పెరిగాయి. అదే సమయంలో అనేక యితర వస్తువుల వుత్పత్తి, అమ్మకాల్లో మాంద్యం యేర్పడింది. 1987 లో ప్రభుత్వ, సహకార వ్యాపార సంస్థల చిల్లర వ్యాపార టర్నోవర్ 9,200,000,000 రూబుళ్ళకు చేరుకుంది. కాగా జనాభా నగదు ఆదాయాలు యీ వర్తక టర్నోవర్‌కన్నా వేగంగా పెరిగినాయి. అందువల్ల కొన్ని వస్తువుల సప్లయికన్నా డిమాండ్ యెక్కువ వుండింది.

క్లుప్తంగా చెప్పాలంటే 1987 నుండి సోవియట్ ప్రజలకు ఒక సంక్లిష్టమైన సమస్య వారసత్వంగా వచ్చింది. సరకుల, సేవల కొరతవల్లనే సగటు తలసరి నిజ ఆదాయాలు వూహించిన దానికన్నా తక్కువ పెరిగాయి.: లక్ష్యం 2.6 శాతం కాగా రెండు శాతం పెరిగాయి. 2 శాతం తక్కువేమీ కాదనుకోండి. అదే సమయంలో ఒక విషయం స్పష్టంగా కనిపిస్తోంది: 1988లో అర్థిక సంస్కరణలను అమలులో పెట్టడంవల్ల మేనేజ్‌మెంట్ సామర్థ్యం పెరుగుతోంది. సోవియట్ ప్రజలు యితోధిక ప్రగతి సాధించగలుగుతారు.

# సోషలిజం సహకారం సమిష్టి వ్యవసాయ క్షేత్రం

లేవ్ వస్క్రిసేన్ స్కీ

సోషలిస్టు నిర్మాణానికిగల శక్తివంతమైన సాధనాల సముదాయంలో, సహకారాన్నికూడా చేర్చాల్సిన అవసరాన్ని గురించి మాస్కోలో జరిగిన సోవియట్ సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల 4వ మహాసభలో మిహాయిల్ గొర్బచేవ్ నొక్కిచెప్పారు. ఆర్థిక జీవితానికీ, కొంతమేరకు రాజకీయ జీవితానికీ సంబంధించి ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో సాగుతున్న పునర్నిర్మాణానికి సాధారణ వ్యూహాన్ని యీసూత్రీకరణ చాలా స్పష్టంగా పేర్కొంటోంది.

సోవియట్ సహకారోద్యమ పుట్టుపూర్వోత్తరాలను గురించి సోవియట్ నాయకుడు ప్రసంగించారు మొదటి ప్రపంచ యుద్ధం, అంతర్యుద్ధం-వీటిమూలంగా యేర్పడిన ఆకలి బాధను, అస్తవ్యస్తతను నిర్మూలించడానికీ, అలాగే ఆర్థిక, ఫైనాన్సి ద్రవ్య వ్యవస్థలను మెరుగుపర్చడానికీ 1920ల ప్రారంభంలో యీ వుద్యమం యెంతో తోడ్పడింది.. యీక్రమం చాలాకాలం పాటు కొనసాగ లేదు. భారీస్థాయిలో సమిష్ట వ్యవసాయక్షేత్రాలను నెలకొల్పుతున్న సందర్భంగా నూతన ఆర్థిక విధానం (నేప్) లాంటి లెనిన్ పంథాను 1920ల చివర్లో, 1930ల ప్రారంభంలో మొరటుగా వక్రీకరించారు. పరిపాలనా సంబంధ వ్యవహారాలు మరింత పకడ్బందీ కావడంతో, సామాజిక జీవితపు ప్రజాతంత్ర పునాదులు కుచించుకు పోవడంతో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలతో సహా సహకార సంస్థలకూ,

ప్రభుత్వరంగానికీ మధ్య మార్పిడిలో అసమానత యేర్పడింది. సహకారసంస్థల లక్ష్యాన్ని పాత్రను అతిక్రమించి, తగ్గించారు. వాటి రూపాల్లో వైవిధ్యత లోపించింది. సొంతచెల్లింపులపై స్వయం నిర్వహణలపై ఆధారపడినట్టి సహకారం వుత్పత్తిఖర్చు లెక్కలమదింపునకూ, విస్తృత ప్రజాస్వామ్యానికి అతీతంగా మనజాలక పోయింది. సహకారాన్ని కుదించారు; దాని కార్యకలాపాల పరిధి తగ్గిపోసాగింది.

సమిష్టి వ్యవసాయక్షేత్రాలను గ్రామీణప్రాంతాల్లో వుత్పత్తి సహకారానికి వెన్నెముకగా మార్చాలని లెనిన్ తలపెట్టాడు. కానీ వాటికి తీవ్రమైన యిబ్బందులు, కొన్ని సందర్భాల్లో విషాదకర పరిస్థితులు యెదురయ్యాయి. సమిష్ట వ్యవసాయ క్షేత్రాల పట్ల, సహకార సంస్థలపట్ల చూపించిన యిలాంటి వైఖరుల పర్యవసానాలు యిప్పటికీ కనిపిస్తున్నట్టు గోర్బచేవ్ పేర్కొన్నారు. ఆహార సమస్యపరిష్కారంలో జాప్యం; వినిమయ సరకుల కొరత, యెంచుకోడానికి తగినంత వైవిధ్యపూరితమైన సరకుల లోటు; సేవల రంగంలో సముచితమైన ప్రమాణాల కొరత; యితర అంశాలు యివి యింకా యీకోవకు చెందినట్టి పర్యవసానాలు యీనాడు సోవియట్ ప్రజలకు తీవ్రంగా ఆందోళన కల్గిస్తున్నాయి.

గత 12నెలల్లో సహకారోద్యమం వూపునందుకుంది. యిప్పటికే సత్ఫలితాలు కనిపిస్తున్నాయి. సమాజంలో ప్రజాతంత్రవరమైన మార్పులూ, నిక్కాక సంబంధమైన కాఠిన్యతకు, అధికార జాప్యానికి వ్యతిరేకంగా కృషీ-వీటి ఫలితమే యీక్రమం. బహిరంగచర్చ, పదవులకు యెన్నికల పద్ధతి, గట్టి జవాబుదారీ, వుత్పత్తి నిర్వహణలో శ్రామికప్రజల భాగస్వామ్యం అనేవి లేకుండా సహకారం నెరవడం బొత్తిగా అసాధ్యమని సోవియట్ ప్రజలు భావిస్తున్నారు. పెరుగుతున్న సహకారోద్యమం, మౌలిక అర్థిక సంస్కరణలు కూడా సన్నిహితంగా ముడివడివున్నాయి.

పార్టీ అనుసరిస్తున్న యీపంథాపట్ల అపనమ్మకం, శత్రుత్వం గలవాళ్ళకూ, కంగారుపెరిగి గాభరా పెట్టేవాళ్ళకూ, సహకారమనేది సోషలిస్టు ఆర్థికరూపంకాదని ప్రైవేటు వ్యాపారానికి తిరుగుముఖం పట్టడమని వాదించేవాళ్ళకూ ప్రస్తుతం భారీస్థాయిలో అభివృద్ధిచెందుతున్న సహకారోద్యమం మంచిజవాబు అని గోర్బచేవ్ చక్కగా చెప్పారు. దోపిడీ, వర్గవైరుధ్యాలూలేని సమాజంలో సహకారమనేది శ్రామికప్రజల సామాజిక వుద్యమమనీ, దాని స్వభావం సోషలిజం కర్తవ్యాలకు, వుత్పత్తి, సమిష్ట తత్వ లక్ష్యాలకు పూర్తిగా అను గుణంగా వుందనీ సోవియట్ నాయకులు పేర్కొన్నారు.

సహకారమనేది తక్కిన అన్ని ఆర్థిక రూపాల లాగే ప్రభుత్వ ప్రభావ పరిధిలోనేవుండాలని మేము భావిస్తున్నాం. అలాంటి ప్రభావాన్ని కేవలం పరిపాలక పద్ధతుల ద్వారాగాక ఆర్థికపరమైన మీటలు ద్వారా నెరపాలి. ఈమీటలు -పన్నులు, రుణాలు, సహకారసంస్థలతో కాంట్రాక్టులు, ప్రభుత్వ ఆదేశాలు.

సహకారరంగంలో వ్యవసాయం యిప్పటికీ అత్యంత ముఖ్యమైనదే. దీని అభివృద్ధికి యిటీవలి కాలంలో యెంతో అనుకూలమైన పరిస్థితులను సృష్టించాం. సమిష్టి వ్యవసాయక్షేత్రాలు నూతన ఆర్థిక సంబంధాలను అనుసరిస్తున్నాయి. వుత్పత్తి ఖర్చు లెక్కల మదింపు ; సమిష్టి , కుటుంబ, వ్యక్తిగత కాంట్రాక్టులు (వుత్పత్తి సాధనాలను అప్పజెప్పడం; ఆర్థిక కార్యకలాపాల ఫలితాలనుబట్టి ప్రతిఫలం చెల్లించడం); భూమిని, పశువులను, స్థలాలను, యంత్రాలను అద్దెకివ్వడం.

సోవియట్ యూనియన్‌లోని గ్రామీణ ప్రాంతాల్లో ఆహార పదార్థాల సరఫరాలను మౌలికంగా మెరుగు పర్చడానికి సహకారోద్యమ అభివృద్ధి ప్రధానంగా తోడ్పడాల్సివుంది. గత రెండు మూడేళ్ళలో యీరంగంలో కొన్ని మంచి మార్పులు వచ్చాయి. అయితే యీమార్పులు చాలవు. తక్కువ వ్యవధిలో మరిన్ని సత్ఫలితాలను సాధించాలి. అందువల్ల చొరవకు, స్వతంత్రాలోచనకు, హేతుబద్ధమైన సాహసానికి ప్రోత్సాహమిచ్చేందుకు కృషిజరుగుతోంది. ఆరోగ్యకరమైన, వ్యవహారసరళిగల పోటీని కూడా మినహాయించడంలేదు.

సోవియట్ సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల4వ మహాసభకు ప్రజాదరణ లభించింది. దీని నిర్ణయాలు, సిఫార్సులు సోవియట్ వ్యవసాయ రంగంలోని, మొత్తం జాతియార్థికలోని పరిస్థితిపై సానుకూల ప్రభావం నెరపగల అవకాశంవుంది.

సోవియట్ ప్రజలు "ప్లూరలిజం"ను (అనేకత్వం) రాజకీయ ప్రస్తావనల్లో అవమానకరమైన మాటగా ఇటీవల వరకు వాడేవారు. ఇప్పుడు ఆ మాట వింటే బెదురుకోవడంలేదు సరికదా "సోషలిస్టు" అనే విశేషణం చేర్చితే దాన్ని సంతోషంతో స్వీకరిస్తున్నాము.

ఈ ప్రస్ఫుటమైన మార్పును కూలంకషంగా విశ్లేషించడం అవసరం. లేకుంటే రెండు పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలకు మనంలోనయ్యే ప్రమాదముంది : ఇది వాడుకలోకి వచ్చిన కొత్త పదం తప్ప మరేమీకాదనుకోవచ్చు; లేదా, దీనిలో మితిమీరిన సామాజిక, రాజకీయ మార్పులు అంతర్లీనంగా వున్నాయనీ అనుకోవచ్చు.

లాటిన్ పదోద్భవమైన "ప్లూరలిజం" అనే మాట లేకుండానే దాని అర్థాన్ని తెలిపే అవకాశాలు రష్యన్ పదజాలంలో యెన్నో వున్నాయి. కొన్ని దశాబ్దాలుగా అలా చేస్తూ వచ్చాంకూడ. సోవియట్ దేశంలోని వైయక్తిక, సామాజిక, జాతీయ ప్రయోజనాల భిన్నత్వాన్ని వేరువేరు బృందాల ప్రయోజనాల, ఆశయాల మధ్యగల తేడాలను వైరుధ్యాలను సైతం పేర్కొన్నాము వాటిమధ్య సామరస్యం నెలకొల్పవలసివుందని నొక్కి చెప్పాము. సోవియట్ సమాజప్రగతికి ఈ ప్రయోజనాలు మధ్యయితోధిక భిన్నత్వం అవసరమని మనం తరచు నిర్ద్వంద్వంగా చెప్పాము.

కాబట్టి మన సామాజిక, రాజకీయ మనస్తత్వానికి అనేకత్వం అన్యమయినది కాదు. కాని, ఈ మాట పట్ల సహనభావమొక్కటే ఈ రంగంలో పెరిస్త్రోయికా తెచ్చిన కొత్త మార్పు అని చెప్పడం తప్పు. మన భాషలో ఈ పదాన్ని ప్రవేశపెట్టడానికి రెండు రకాలైన అర్థముంది.

అది మన మనస్తత్వంలో వచ్చిన ఒక మార్పును సూచిస్తుంది. పిడి సూత్రాలను, పాతపడిన భావాలను తుడిచి పెట్టే మార్పు అది. మూసపోత సూత్రీకరణలను పట్టుకొని వేలాడుతూ, కొత్త భావాలను, కొత్త మాటలను సైతం నిషేధించే పెత్తందారీ ఆలోచనా సరళితో తెగతెంపులు చేసుకొనే మార్పు అది. మన దైనందిన, రాజకీయపరిభాషలో "ప్లూరలిజం" అనే మాటను నేడు స్వేచ్ఛగా వాడుతూండటం మన సమాజంలో భావస్వేచ్ఛ

పెంపొందుతూందనడానికి గుర్తు.

అంతకన్న ముఖ్యమైనదిది : "ప్లూరలిజం" అనే మాట, ఒక్క లేదా పలు సంబంధితభావాల ను వ్యక్తం చేసే పర్యాయపదజాలంలో చేరడం వల్ల సార్వత్రిక విలువల శ్రేణిలో ఆ భావాల స్థాయి పెరిగింది. జనం ఒకరికొకరు ప్రతిబింబా ల్లాగా వుండాలని కోరడం పరమమూర్ఖత్వం అని మనకు తెలీదని కాదు. కాని ప్రయోజనాల అభిరు చుల వైవిధ్యం పట్ల మనం బొత్తిగా శ్రద్ధ వహించ లేదనేదే నిజం. వాటిమధ్య సామరస్యం సాధించ డానికీ, నూతన శక్తిదాయకమైన ఆ వైవిధ్యాన్ని అందిగి మంచి కోసం వుపయోగించుకోలేదు

పెరిస్త్రోయికా ఈ పరిస్థితిలో క్రీ లకమైన మార్పు

ఇక్కడ "సోషలిస్టు" అనే విశేషణాన్ని గమనించాలి. దాన్ని శ్రద్ధగా గమనిస్తే, అనేకత్వం సోవియట్ సమాజంలో కమ్యూనిస్ట్ పార్టీ నాయక పాత్రను తగ్గించి వేస్తుందనీ, నిర్మూలిస్తుందని కూడ పాశ్చాత్య ప్రపంచంలో వ్యాపించిన భ్రమకు ఆస్కారం వుండదు. సమస్యను తేలిక చేసి తరచు యిలా చూపుతున్నారు. దేశంలో అనేకత్వం బహుళ పార్టీ వ్యవస్థ అయినా వుంటుంది. లేదా అనేకత్వం వుండదు. యెందువల్లనంటే కమ్యూని స్టుపార్టీ ఒకటేవుంటే అనేకత్వం అనూహ్యం అని వారి వాదన.

ఈ విధంగా సమస్యను తేలికచేసి చూపుతున్న ది మన పరిణామాలను గురించిన పాశ్చాత్య వ్యాఖ్యాతలే కాదు. సోవియట్ పిడివాదుల తర్కం మనమింకా మరచిపోలేదు.

# సోషలిస్టు తరహా అనేకత్వం

లెవ్ సెపనోవ్

తెచ్చింది. ప్రయోజనాల వైవిధ్యాన్ని పరిగణకు తీసుకొని, వాటిని నియంత్రించడం, వాటి సహాయంతో సమాజాన్ని ముందుకు నడిపించడం నేటి ఒక ముఖ్య కర్తవ్యం. ఈ అర్థంలో అనేకత్వం మన కాలానికి అనుగుణమైన రాజకీయావసరం.

మన పత్రికల్లో, కళల్లో అనేకత్వం కావలసినంత వుందని తెలుస్తుంది. మరో విశేషమేమిటంటే, ఎన్నికల్లో పలువురు అభ్యర్థులు పోటీ చేసే పద్ధతి పార్టీ, ప్రభుత్వ సంస్థల్లోనూ, కర్మాగారాదుల్లోనూ, కార్యలయాల్లోనూ దృఢంగా వేరూనుతూంది.

సోషలిస్టు తరహా అనేకత్వం మూడు పూవులూ, ఆరుకాయలుగా వర్ధిల్లుతోంది.

అనేకత్వాన్ని ప్రోత్సహించి పెంపొందించడం తన ప్రథమ కర్తవ్యంగా నేడు కమ్యూనిస్టుపార్టీ భావిస్తూంది.

సంగ్రహంగా చెప్పాలంటే, సోవియట్ యూని యన్‌లో అనేకత్వం అభివృద్ధి చెందేకొద్దీ, స్వశక్తి వ్యక్తీకరణకు ప్రతిసామాన్యునికీ అవకాశం కలుగు తుంది. అది దేశావసరాలు పూర్తిగా తీరే అవకాశ మిస్తుంది. అనేకత్వం పార్టీపై అధికాధిక కర్తవ్యాల ను మోపుతూ, దాని బాధ్యతను పెంచుతుంది.

తుదకంటాచూస్తే, అనేకత్వమంటే ఇతోధిక మైన సోషలిజమే.

# మరణశిక్ష
# వాదోప

సోవియట్ సమాజాన్ని ప్రస్తుతం ప్రజాస్వామ్యయుతం చేస్తూండడంవల్ల, గతంలో నిర్వివాదమైనవిగా కనిపించిన అనేకభావాలు మారుతున్నాయి నేరానికి శృతిమించి శిక్షవేయరాదని-ముఖ్యంగా సోవియట్ యూనియన్‌లో అమల్లోవున్న మరణశిక్ష విషయంలో తీవ్రంగా చర్చలు సాగుతున్నాయి.

మరణశిక్షను అలాగేవుంచాలని అత్యధికులు బావిస్తుంటగా, మానవజీవితానికి ముప్పుతేవడాన్ని సామాజిక నీతి సహించరాదని వాదించేవారి సంఖ్య పెరుగుతోంది.

యు.ఎస్.ఎస్.ఆర్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీకి చెందిన స్టేట్ అండ్ లా యిన్‌స్టిట్యూట్‌లోని క్రిమినల్ చట్ట సిద్ధాంత, సామాజికశాస్త్ర విభాగ అధిపతి, ప్రముఖ న్యాయవాది ప్రొఫెసర్ అలెగ్జాండ్ర యాకొవ్లెవ్ మైనారిటీ పక్షంలో వున్నారు.

యాకొవ్లెవ్ యిలా చెప్పారు: "మరణశిక్షను రద్దుచేసేంతవరకూ అది 'తాత్కాలిక' చర్యగా వుంటుందని ప్రస్తుతమున్న సోవియట్ క్రిమినల్ చట్టం పేర్కొంటోంది. (యు.ఎస్.ఎస్.ఆర్. రిపబ్లిక్కుల క్రిమినల్ చట్టమౌలిక నియమాల్లో 22వ నిబంధన). కానీ గత దశాబ్దాల్లో దీన్ని వర్తింపజేయడం యెక్కువైంది. భయంకరమైన హత్య (పథకంప్రకారం హత్యచేసే పరిస్థితులను విషమింపజేయడం), దేశద్రోహం, పెద్దదారులు, టెర్రరిజం- వీటికి మాత్రమే గాక పెరుగుతున్న అపహరణ దొంగనోట్ల ముద్రణలాంటి ఆర్థిక నేరాలకుకూడా మరణశిక్షను వర్తింపజేస్తున్నారు. తాత్కాలిక చర్య నియమంగా మారే ప్రమాదముంది. కఠినశిక్ష వేయడం వల్ల నేరాల సంఖ్య తగ్గదంటేను.

"ధనాపహరణకు వ్యతిరేకంగా పోరాటం జరపడానికి బదులుగా ఆర్థిక నేరాలను వుపశమింపజేయడానికి చట్టబద్ధమైన అణచివేతను వుపయోగించడంవల్ల యిలా జరుగుతోంది. ఆర్థిక నేరాలకు దారితీసే సంబంధాలను మార్చడం యెంతో క్లిష్టమైనది; కానీ అధికతర ఫలితాలనిస్తుంది.

ఎంతపెద్ద మొత్తం ధనాపహరణ చేసినప్పటికీ మానవజీవితం అంతకన్నా విలువైనదని నేను

## సమర్థకులు

ఒప్పుకుంటాను. కానీ యితరుల ప్రాణాలు తీయడానికి ప్రయత్నించే బందిపోట్లు, హంతకుల సంగతేమిటి? తగువిధంగా వారిని శిక్షించవద్దా?

జీవిత కారాగారశిక్షవేసి వాళ్ళను చాలా తీవ్రంగా శిక్షించాలి. కానీ మరణశిక్షవేసి కాదు. 'కంటికి కన్ను' అనే సూత్రం హత్యను చట్టసమ్మతం చేస్తుంది. అది సమాజంలో క్రూరత్వాన్ని పెంచుతుంది. దానివల్ల, అప్పుడప్పుడూ న్యాయస్థానం చేసే పొరబాట్లను సరిదిద్దుకోడానికి బొత్తిగా వీలుండదు. అంతేగాక పశ్చాత్తాపానికి, నేరాన్ని నివారించేందుకు మార్గంగా మాత్రమేగాక, సంస్కరించడానికి శిక్షను ఒక పద్ధతిగాకూడా సోవియట్ చట్టం పరిగణిస్తోంది. కానీ 'అసాధారణ చర్య' అనేది నేరస్తులు పదీ యిరవై యేళ్ళలో కూడా సంస్కరణ పొందడానికి అవకాశమివ్వదు. పెరిస్త్రోయిక అంటే అరాచకత్వాన్ని, సామాజిక

# రద్దు సమస్యపై వాదాలు:

అన్యాయాన్ని సహించకుండా వుండడం; యిదీ నా అభిప్రాయం.

**కనీసం కొన్ని నేరాలకైనా మరణశిక్ష వుండాలనే మీ ప్రత్యర్థుల వాదనలేమిటి?**

"మరణ శిక్షను రద్దుచేస్తే తీవ్రనేరాల సంఖ్య పెరుగుతుందని అత్యధికులు భయపడుతున్నారు. మరణశిక్ష పడుతుందని నేరస్తునికి యేర్పడే

# వ్యతిరేకులు

భయం వ్యక్తిగత భద్రతలో ముడిపడి వుందని వీరి అభిప్రాయం. అంతేగాక, మాజీ నేరస్తుల్లో యెక్కువమంది మామూలు జీవితం గడపాలను కుంటున్నప్పుడు, వారికి అలాంటి అవకాశం కల్పించడానికి ఒకమోస్తరుశిక్షలు తోడ్పడతాయి. యేదేమైనా, కేన్ కాలంనుంచీ ప్రపంచం మారనూలేదు, శిక్షనుచూసి భయపడనూలేదు అని మార్క్స్ చెప్పిన మాటల్ని మర్చిపోరాదు.

**మరణశిక్షరద్దు గురించి మీసహచరుల అభిప్రాయమేమిటి?**

"వారిలో యెక్కువమంది దీన్ని సమర్థిస్తున్నారు. ప్రస్తుతం, 18 యేళ్ళలోపు మైనర్ల, గర్భిణీ స్త్రీల విషయంలో మరణశిక్షను చట్టం నిషేధిస్తోందనీ, తర్వాతిదశలో బహుశ స్త్రీలనందరినీ, 60 యేళ్ళకు పైబడినవారినీ, తదితరులను మినహాయించవచ్చుననీ వారు చెప్తున్నారు.

మరణశిక్షను రద్దు చేయకూడదని గట్టిగా వాదించేవారుకూడా వున్నారు. సాధారణంగా వారు వాదోపవాదాల ద్వారా గాక మనదేశం యింకా అందుకు సిద్ధంగా లేదనేలాంటి నిర్ధారణలు చేస్తున్నారు. మనం ప్రజాభిప్రాయాన్ని ఖాతరు చేయాలి. కానీ, వెనుకబడి వుండకూడదు. యీమాట అంతిమ నిర్ణేతలకు, అంటే శాసనకర్తలకు ప్రత్యేకించి వర్తిస్తుంది. భావోద్రేకాలకు లోనుగాకుండా వివేచనతో, వున్నత మానవతావాదాన్ని లెక్కలోకి తీసుకొని వ్యవహరించినప్పుడు మాత్రమే ఒక శాసనకర్త విజ్ఞుడనిపించు కుంటాడు."

**మిమ్మల్ని ఒకప్రశ్న సూటిగా అడుగుతాను: మన క్రిమినల్ చట్టంలో రాబోతున్న సంస్కరణలో మరణశిక్ష రద్దు అనేది ఒక భాగంగా వుండాలని మీరు భావిస్తున్నారా?**

హత్యలతో సంబంధంలేని నేరాలన్నిటి విషయంలో మరణశిక్షను లేకుండా చేయాలని నేను భావిస్తున్నాను. నిజానికి, తక్షణ భవిష్యత్తులో మరణశిక్షరద్దుఅవుతుందని నేను అనుకోవడంలేదు. అలాంటి చర్యకు ప్రజలు యింకా సంసిద్ధంగా లేరు. చర్చద్వారా, బహిరంగంగా, నిష్పక్షపాతంగా అభిప్రాయాల మార్పిడిద్వారా, ప్రజాతంత్రయుతంగా సోవియట్ సమాజాన్ని పునరుద్ధరించే కృషి పెంపొందడంలో ఒక అనుభవాన్ని సంచయించుకోవచ్చు.

మన సమాజాన్ని మానవీయంగా మార్చేక్రమానికి మరణశిక్షరద్దు దోహదం చేయగలదనీ, నిస్సందేహంగా పెరిస్త్రోయ్‌క ప్రధాన లక్ష్యాలలో యిది ఒకటనీ నేను భావిస్తున్నాను."(ఎ.పి.యన్)

# నూతన ఆలోచనాధోరణి సామాజిక ప్రగతి

**లెవ్ మిత్రోఖిన్, డి.ఎస్సి. (తత్వశాస్త్రం)**

నూతన ఆలోచనా ధోరణి ఒక చిహ్నం

నూతన ఆలోచనా ధోరణి'' అనే పదాన్ని విశ్లేషించడంపై యీ సమావేశం ప్రధానంగా కేంద్రీకరించింది. ఆ పదం అర్థం ఏమిటి? ఒక బోధనాత్మక, నైతిక విజ్ఞాపనా? ఒక సాహిత్యా పరమయిన పద చిత్రమా ? లేక సాంస్కృతిక క్రమ పరిణామంలోని ఒక ముఖ్యమైన దశపై వెలుగును ప్రసరించే స్పష్టమైన అర్థంగల ఒక అభివర్గమా? ఇతమిద్ధమైన జవాబు యిప్పటి వరకూ ఎవరూ యివ్వలేదు. ఈ విషయమై సమావేశంలో తీవ్ర మైన చర్చ జరిగింది.

వై.ప్లిమక్, డి.ఎస్సి; (చరిత్ర) ప్రధాన పత్రం సమర్పించారు. ''నూతన ఆలోచనా ధోరణి''

ప్రజ్ఞాన శాస్త్రీయ పద్ధతి అనేది యిప్పటి వరకూ తెలియని కొత్త జ్ఞానాన్ని సముపార్జించుకొనేందుకు వుద్దేశించింది.

నూతన ఆలోచనా ధోరణి, వర్గ పోరాట సిద్ధాంతంపై జరిపిన సమావేశం యీ సందర్భంలో ఎంతో ఉపయుక్తమైంది. సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడెమీలోని ప్రపంచ విప్లవోద్యమ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన ప్రపంచ విప్లవక్రమ సిద్ధాంత సమస్యల విభాగం ఆధ్వర్యాన యీ సమావేశం జరిగింది.

భావనకు మూలం 1955 నాటి ఐన్‌స్టీన్ రస్సెల్‌మేనిఫెస్టో. అణుయుగంలో యుద్ధం అంటే మొత్తం మానవ జాతికే మృత్యువు తెచ్చి పెడు తుంది. అందువల్ల రాజ్యాల మధ్య సంబంధాలలో బల ప్రయోగాన్ని విసర్జిం చాలి. అని ప్రపంచంలోని రాజ్యా లకు యీ మేనిఫెస్టో విజ్ఞప్తి చేసింది.

సమాజ విజ్ఞాన శాస్త్రజ్ఞులవలె కాకుండ ప్రకృతి విజ్ఞాన శాస్త్రజ్ఞులకు తాము అభివృద్ధి పర్చిన అణ్వాయుధాలను వినియోగిస్తే ఎంత వినాశకర పర్యవసానాలు వచ్చి పడేది బాగా తెలుసు. అందు వల్ల ప్రకృతి విజ్ఞాన శాస్త్రజ్ఞులే యీఆలోచనా ధోరణిని ఆరంభించారు అని ప్రధాన పత్రంలో ఆయన పేర్కొన్నారు.

సమస్య మరింత జటిలమయిందిగా సమగ్రమయిందిగా కనిపిస్తున్నప్పటికీ యీ అభిప్రాయాన్ని ఎవరూ కాదనలేరు. అయితే యీక్రమం కాలక్రమేణా రూపుదిద్దుకున్నది. పరస్పర విరుద్ధలతో కూడుకున్నది. అందువల్ల నూతన ఆలోచనా ధోరణి సరిగ్గా ఏ తేదీని ప్రారంభమైందో వివరించడం సాధ్యమేమీ కాదు.

అణ్వాస్త్రాలను మొదటినుంచీ రాజకీయ సమస్యగా పరిగణించడం జరిగింది. వాటిని ఉపయోగిస్తే వచ్చే పర్యవసానాలు గురించి రాజకీయవేత్తలకు బాగా తెలుసు. (హిరోషిమా, నాగసాకీలపై బాంబు దాడులు కూడా అలా జరిగినవే). సోవియట్ యూనియన్ తనసొంత ఆటంబాంబును తయారుచేసుకున్న అనంతరమే, రెండు అగ్రరాజ్యాల మధ్య ఘర్షణవల్ల ప్రపంచ సర్వ వినాశ ప్రమాదం వాస్తవమని తేలినాకనే, యిప్పుడు మనం వాడుతున్న అర్థంలో నూతనఆలోచనా ధోరణి అనేది రూపుదిద్దుకోవడం ఆరంభమైంది. శాస్త్రజ్ఞులు ఆప్రమాదాన్ని గురించి ఆధారాలతో వివరించారు.

ఉత్పాదక శక్తుల గరిష్ఠ పెరుగుదలకు దీర్ఘ కాలంపాటు హామీ కల్పించిన యూరపియన్ సాంస్కృతిక సంప్రదాయంలో పెద్ద మార్పుల నేపధ్యంలో కొత్త మనస్తత్వం రూపుదిద్దుకున్నది. విజ్ఞాన శాస్త్రం సామాజిక చైతన్య అత్యున్నత రూపం మానవాళికి ప్రగతికి నమ్మదగ్గ గ్యారంటీ అనేభావన పెద్దమార్పు చెందుతోంది. విజ్ఞాన శాస్త్రమే స్వయంగా ఉత్పాదకశక్తి అవుతోంది; సామాజిక రుగ్మతకు, ప్రపంచ స్థాయి సమస్యలు విషమం కావడానికీ అది కారణం అవుతున్నందున యీ మార్పు వస్తున్నది. శతాబ్దాల మానవసంబంధాల అనుభవాన్ని దృష్టిలో పెట్టుకోగల మానవీయ జ్ఞానానికి ప్రాధాన్యత యివ్వడం యీదృష్ట్యా తప్పనిసరి. అంటే నీతి, సంస్కృతి రంగాలలో అంతగానూ మౌలిక విప్లవంతో విజ్ఞాన శాస్త్ర సాంకేతిక విప్లవాన్ని దృఢతరం చేయడం అవసరం.

అయితే యిలాటి భావనలు విజ్ఞాన శాస్త్ర వ్యతిరేక, సాంకేతిజ్ఞతా వ్యతిరేక భావాలకు, హేతు విరుద్ధ, మార్మిక సిద్ధాంతాలకు, మత మౌఢ్యవాదానికి ప్రాచ్య నైతిక మానసిక అనుభవం వైపు శ్రద్ధ వహించడానికి మొదలైన వాటికి దారితీయ వచ్చు.

సోషలిస్టు సమాజంలో కాలక్రమేణా పేరుకున్న కొన్ని ప్రతికూల స్థితిగతుల దృష్ట్యా ఆర్థిక మేనేజిమెంటులో, మానవ చైతన్యంలో పునర్వ్యవస్థీకరణ అవసరమైంది. అంతర్జాతీయ సంబంధాలతో సహా సామాజిక కార్యాచరణలోని అన్ని అంశాలను సిద్ధాంతపరంగా అవగాహన పర్చుకోడానికి ఒక సాధనంగా నూతన ఆలోచనా ధోరణి తప్పనిసరైంది.

ఒక్కమాటలో చెప్పాలంటే "నూతన ఆలోచనా ధోరణి వర్తమాన సామాజిక చారిత్రక క్రమంలో అత్యంత తీవ్రమయిన తక్షణావసరాలను ప్రతిబింబించే ఒక చిహ్నం. సామాజిక పునర్నవ మార్గాలకు శాస్త్రీయమైన వివరణలో ముఖ్యమైన ఒక అభివర్గంగా దానిని పరిగణించవచ్చు.

పైన పేర్కొన్న సమావేశం యీ అంశాన్ని పలు కోణాల నుంచి పరిశీలించింది. మానవాళి సర్వవినాశక ముప్పు గురించిన ఎరుక నూతన ఆలోచనా ధోరణిలో కీలకమైందని వై.కర్లాకిన్ నొక్కిచెప్పారు.

ప్రపంచం ఒక్కటే• మనుగడకోసం ఉద్యమంలో కమ్యూనిస్టులు, కమ్యూనిస్టు వ్యతిరేకులు సంఘటనగా ఏర్పడే కర్తవ్యం యిదవరకెన్నడూ యిలా నిర్దేశితం కాలేదు. వ్యవధి అనే అంశం యిప్పుడు అతి ముఖ్య స్థానం పొందింది. జీవితం, మృత్యువు-వీటిలో ఏదో ఒకటి ఎంచుకోవాలి అనే దృష్టి నుంచి అన్ని సామాజిక సిద్ధాంతాలను నేడు అధ్యనం చేయాల్సి వుంది.

అటు సిద్ధాంత పిడివాదాలనీ యిటు కేవల కార్యసాఫల్య వైఖరులనూకూడా అధిగమించడం నూతన ఆలోచనా ధోరణి సారం, అని ఎం.నొపిన్స్కరూ (చరిత్ర క్యాండిడేట్) అన్నారు. కేవలం అణ్వాస్త్ర ముప్పువల్లె యీ ఆలోచనాధోరణి వచ్చిందనడం పొరపాటు. పాశ్చాత్య నాగరికత ప్రాధమిక సూత్రాలలో సంక్షోభ సహజఫలితమే నూతన ఆలోచనా ధోరణి, పాశ్చాత్య నాగరికతను ప్రపంచ సంస్కృతీ మూలబిందువుగా పరిగణించడం యింకేమాత్రం వీల్లేదు. స్వతంత్ర వ్యక్తిత్వంఅనే ఆదర్శానికి యూరపియన్ ఆలోచన ఒక రూపమిచ్చింది. చారిత్రకంగా దానిసేవ యిది. అయితే మనిషిని ప్రకృతికి ప్రత్యర్థిగా నిలబెట్టింది. పర్యావరణపరంగా నైతిక దృష్టి ఆవశ్యకతను నిర్లక్ష్యపుచ్చింది. ప్రకృతిని నిరర్ధకంగా పాడుచేయడం తప్పనే భావన లేకుండా చేసింది. ఫాదార్థిక సంపదకు అక్షయపాత్రగా ప్రకృతిని పరిగణించారు. వీలైనంత త్వరగా దాన్ని సొంతం

చేసుకోవడం అవసరమన్నారు. ఆవైఖరి మానవాళిని వినాశకత అంచుకు నెట్టింది.

మానవాళి ఆత్మహత్యకు అణుయుద్ధం కూడా ఒక కారణం కావచ్చు. యింకా యితర కారణాల వల్ల కూడా అది జరగవచ్చు. అందువల్ల అణు యుద్ధం గురించి మాత్రమే హెచ్చరిస్తే చాలదు. మొత్తం వర్తమాన నాగరికతను పునర్నిర్మించాల్సి వుంది.

నూతన ఆలోచనాధోరణి ఒక ముఖ్యమైన మలుపుగా యిటు కార్యాచరణలోనూ, అటు చైతన్యంలోనూ కూడా పునర్వ్యవస్థీకరణకు సాధనంగా రూపొందాలని సమావేశంలో పాల్గొన్నవారు ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు. అయితే యిదిమరీ సామాన్యీకరించిన పద్ధతిలో వుంది. శాస్త్రీయంగా వర్తింప చేయాలంటే అది నిర్దిష్టంగా వుండటం అవసరం

### విప్లవతత్వానికి గీటు రాయి

నూతన ఆలోచనాధోరణి పరిధి ఏది అది అనువర్తించే రంగాలు ఏవి అనే విషయంపై పండితుల మధ్య భిన్నాభిప్రాయాలు వ్యక్తమైనాయి. వర్గపోరాట సిద్ధాంతానికి దానిని విస్తరింప జేయాలని కొందరన్నారు. .ఆకి వాస్తవిక రాజీ రూపాల కోసం అన్వేషణ ద్వారా ప్రపంచ సామాజిక పునర్నవ మార్గాల ఎంపికకు కూడా విస్తరింప జేయాలని వారన్నారు. అయితే కేవలం యుద్ధం శాంతి సమస్యలకే నూతన ఆలోచనా ధోరణిని వర్తింపజేయాలని యితర రంగాలకు విస్తరింపచేయడం అనుమతించరాని విషయమని మరికొందరు వాదించారు. అణ్వాస్త్ర ప్రళయాదాన్ని చూసి భయభ్రాంతులం కావడం కాదు. వర్గ పోరాటం తిరుగులేనిది. దాని రూపాలను నియమాలను ఎప్పుడో మార్క్సిస్టు విజ్ఞాన శాస్త్రం నిర్వచించింది అని వారు పేర్కొన్నారు. హింస పాత్రను విశ్లేషించడంలో సైతం ఏకాభిప్రాయం కుదరలేదు చరిత్రకు మంత్రసానిగా హింసా సూత్రానికిగల ప్రాముఖ్యత యిప్పటికీ వుందని కొందరన్నారు. యిప్పుడు బలాన్ని వుపయోగించడం అంటే మానవాళికి సమాధులు తవ్వడమే; అది కాలం చెల్లిందని మరికొందరన్నారు.

వై. ఫ్లిమిక్ తన పత్రంలో యిలా మరీ ఆచివరికో యాచివరికో లాగకుండా తన అభిప్రాయాలు చెప్పారు. ఏ స్థానిక ఘర్షణ అయినా మండల ఘర్షణగా ప్రపంచ ఘర్షణగా పెరిగే ప్రమాదం యిప్పుడుంది. ఒక రాజ్యంలో వర్గ సంబంధాలకు, రాజ్యాల మధ్య సంబంధాలకు నడుమ దూరం తగ్గుతున్నది. అందువల్ల పోరాటరూపాలను ఎంచుకోవడంలో ఎంతో జాగ్రత్త వహించడం అణు యుగం దృష్ట్యా అవసరం. ఆపోరాటంలో నాగరికమయిన అనుగుణమైన రూపాలను విప్లవ శక్తులు చేపట్టాల్సివుంది. అయితే యిది మార్క్సిజం విప్లవ సంప్రదాయాల నుంచి వైదొలగడం ఎంతమాత్రం కాదు. ఆరూపాలు వస్తుగత పరిస్థితిపై ఆధారపడి వుంటాయని మార్క్సిజం వ్యవస్థాపకులు తిరుగులేని విధంగా పేర్కొన్నారు. ఆవస్తుగత పరిస్థితిలో ఇప్పుడు పెద్దమార్పులు వచ్చాయి.

''మానవ నాగరికతలో సంక్షోభం'' అనే భావనను ఆమోదించినట్టయితే మనుగడ సమస్యకు పరిష్కారాన్ని పొంద వీలుంటుందని ఫ్లిమిక్ అభిప్రాయబడ్డారు. బూర్జువా వర్గంలో ఉదార ఆలోచనగలవారు (ఉదాహరణకు రోమ్ క్లబ్ రచనలు) పాశ్చాత్య సోషల్ డెమొక్రాట్లు, అనేకమంది మత కార్యకర్తలు, పాశ్చాత్య రాజకీయవేత్తలలో విజ్ఞతగలవారు - వీరంతా పైని పేర్కొన్న భావనను వ్యక్తపరుస్తున్నారు. శాస్త్రీయ దృక్పథంతో దీన్ని నిర్దిష్ట పర్చాల్సివుందని వేరే చెప్పనక్కరలేదు. అలా నిర్దిష్టం చేసిన భావన మానవాళి నెత్తిన వేలాడుతున్న ప్రమాదాన్ని గురించి సరైన అభిప్రాయాన్నిస్తుంది; ఒకప్పటి ఫాసిస్టు వ్యతిరేక సంఘటన కన్నా మరింత విస్తృత ప్రాతినిధ్యంగల శాంతికాముక శక్తుల అంతర్ వర్గ సంఘటనను స్థాపించడానికి అది ప్రోత్సహిస్తుంది. అణ్వాస్త్ర మహా విపత్తు వేపు మానవాళిని నెడుతున్న సామ్రాజ్యవాద వర్గాలను ఏకాకులను చేసేందుకు అది మరిన్ని అవకాశాలను కలిగిస్తుంది. అందువల్ల అలా నిర్దిష్టం చేసిన భావనను మార్క్సిస్టు వర్గ పోరాటపు సిద్ధాంతంలో చేర్చడానికి వీలేర్పడుతుంది.

జెడ్. యఖిమొవిచ్ (డి.ఎస్సీ. చరిత్ర), తమ పత్రంలో యీ అంశాన్ని మరింత చర్చించారు. సామాజిక ప్రగతికి పరిస్థితులు కల్పించడం ఆ ప్రగతి నిరంతరం కొనసాగేట్టు చూడటం, విడివిడి దేశాలు మండలాలలో సామాజికాభివృద్ధిలోని, ప్రమాదకరమైన తేడాలను అధిగమించేట్టు చూడటం-యీకృషిలో విప్లవ శక్తులకుగల సామర్థ్యమే అఖండమైన, పరస్పరాధారమైన అదే సమయంలో ప్రగాఢ వైరుధ్యాలుగల ఘనాటి

ప్రపంచంలో విప్లవకతకు గీటురాయి. మానవ చరిత్రే ముగిసిపోయే ముప్పు 19 వ శతాబ్దంలోనో 20 వ శతాబ్ద తొలి అర్ధభాగంలోనో లేదు. అందువల్ల సామాజిక పురోగతికోసం పోరాటంలో యిది ఒక కొత్త అంశం అని ఆమె పేర్కొన్నారు. మానవ పురోగతి నిరంతరం సాగుతుందనే భావం ప్రాతిపదికగా అప్పటి విప్లవ శక్తులు ముందుకు సాగాయి. మానవాళి చరిత్రను సాధ్యమైనంత తక్కువ కాలంలో పరివర్తింప చేయడం తమ ప్రధాన లక్ష్యంగా అవి అప్పుడు పెట్టుకున్నాయి. సోషలిజాన్ని వ్యతిరేకించే వారిపై విప్లవకర హింసతో సహా అనేక విధాల పద్ధతులలో సామాజికాభివృద్ధిని సత్వర పర్చాలని నాడు వారు తహతహలాడారు.

20 వ శతాబ్దం చివరి నాటికి వర్గ, మానవ సంబంధ, జాతీయ, ప్రపంచస్థాయి అంశాల పరస్పర ప్రభావాలు మరింత క్లిష్టమైనాయి. వర్గ పోరాటం ప్రపంచ స్థాయిత్వాన్ని పొందింది. మరిన్ని జీవన రంగాలు దాని పరిధిలోకి వచ్చాయి. మానవాళి తన మనుగడకోసం కృషిలో అనేక కొత్త సంఘీభావ, సహకార రూపాల కోసం అన్వేషణ సాగించింది.

''నూతన ఆలోచనా ధోరణి'' అనే పదానికి మరింత నిర్దిష్టమైన నిర్వచనం యివ్వడం చాలా ముఖ్యం అన్నారు వి. గెల్స్‌రాస్ (డి.ఎస్సీ. చరిత్ర) తమ పత్రంలో. ప్రపంచ పరిస్థితినీ, జాతీయ అభివృద్ధి మార్గాల ఎంపికనూ విశ్లేషించడంలో కొత్త పుంత తొక్కాల్సిన అవసరమేమిటో చెప్పాలన్నారు. ప్రపంచ రాజకీయాలలో ''పాత ఆలోచనా ధోరణిగా'' యిప్పుడు మనం పిలుస్తున్న దాని ప్రాధమిక అంశాలను విఫరించారు. లక్ష్యాల సాధనకు బలప్రయోగాన్ని ఒక మార్గంగా అంగీకరించడం, రాజకీయ కొనసాగింపునకు యుద్ధాన్ని ఒక సాధనంగా అంగీకరించడం, సైనిక కూటాలు నెలకొల్పడం; సైనిక రాజకీయ బెదిరింపు భావనను తిరుగులేనిదిగా పరిగణించడం అంతర్జాతీయ ఘర్షణలను వాటి వర్గ స్వభావాన్ని బట్టి వాటి మధ్య తేడాలు చూడడం. యివన్నీ పాత ఆలోచనాధోరణి. ఈ అంశాలు వేటినీ నూతన ఆలోచనా ధోరణికి అనుగుణమైనవిగా పరిగణించజాలము..

నూతన ఆలోచనా ధోరణి వస్తుగత ఆవశ్యకతను మానవాళి గుర్తించడానికి యింకా ఎంతో కాలం పట్టవచ్చు, ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికాలలో సాగుతున్న అనేకమయిన సుదీర్ఘ సాయుధ ఘర్షణలు చూస్తే వర్గ, జాతీయ, మతపోరాటాలలో పాత రూపాలు తమ పాత్రను ఎంతమాత్రం కోల్పోలేదనీ, యీ మండలాలలో ప్రజా సమీకరణ కొత్త రూపాలు, కొత్త ధ్యేయాలు, కొత్త పోరాట రూపాలు ఎక్కడో అరుదుగా తప్ప అసలు వునికిలోనే లేవనీ స్పష్టంగా తెలుతోంది. అణుయుద్ధం యింకా నైర్యామైన విషయంగానే పరిగణిస్తున్నారు. దాని పర్యవసానాలు ఏమిటో చాలామందికి యిప్పటికీ తెలియవు. అణ్వాస్త్ర ముప్పు ఒక్కటేకాదు. పర్యావరణ సమస్యలుకూడ అంతగానూ ప్రమాదకరమైనవిగా సమీప భవిష్యత్తులో రూపుదిద్దుకోవచ్చు. ఆ దృష్ట్యాగూడా లక్ష్యాల్లో ప్రజా పోరాట రూపాల్లో పెద్ద మార్పు అవసరం. వి.వెర్నాద్‌స్కీ 60 సంవత్సరాల క్రితం ఒక కొత్త భావనను రూపొందించారు. పర్యావరణంలో భాగమైన మనిషి ఒకానొక దశవచ్చే సరికి దాని భవిష్యత్తుకు బాధ్యత వహించాల్సి వస్తుంది అన్నది యీ భావన. అయితే వర్గపోరాటంలో సాధారణ ప్రజాస్వామిక పోరాటంలో కొత్త సరళులవల్లా, ప్రజలను ఐక్యపరచడంలో కొత్త రూపాలవల్లా మాత్రమే మనస్తత్వంలో యిలాటి మార్పు సాధ్యమవుతుంది.

**సార్వజనీన ప్రయోజనాలు వర్గ ప్రయోజనాలు**

సార్వజనీన మానవ ప్రయోజనాలు, వర్గ ప్రయోజనాలు వీటి పరస్పరసంబంధాన్ని దృష్టిలో పెట్టుకోవాల్సి వుంటుంది. వర్గ విలువల కన్నా సార్వజనీన మానవ విలువలకు ప్రాధాన్యత నివ్వాలన్న లెనిన్ ఆలోచనను అభివృద్ధిపర్చిన గోర్బచేవ్ యీ విషయాన్ని పదే పదే నొక్కి చెబుతున్నారు. కె.కాతోర్ (క్యాడిడెట్,. తత్వశాస్త్రం) యీ అంశాన్నే తన పత్రంలో చర్చించారు. కొత్త ఆలోచనా ధోరణిని రస్సెల్, ఐన్‌స్టీన్ మేనిఫెస్టోతో ముడి పెట్టడం పొరపాటని ఆయన అభిప్రాయం. యుద్ధవ్యతిరేక భావన అనేది వేల సంవత్సరాలుగా వున్నది. పురాణాలు, ఓల్డ్ టెస్టమెంట్, గాస్పెల్‌లన్ను పునరుజ్జీవన కాలంలో మానవతా భావాలు, కాంట్ వంటి వారు రాసిన అనేక గ్రంధాలు మొదలైన వాటిని ఆయన యీ సందర్భంగా పేర్కొన్నారు.

అయితే మార్క్సిజాన్ని సులభీకృతం చేయడం దానికి పేదరికం తెచ్చిపెట్టడం ఎంత మాత్రమూ అనుమతించరాదు. మనిషి గురించిన తాత్వికభావన, సంస్కృతిని గురించిన భావనతో మార్క్సి

జాన్ని పరిపుష్టం చేయాలి. ఈ భావనలను అభివృద్ధిపర్చడంలో మార్క్సు, ఎంగెల్సులు అంతకు ముందుగల సాంస్కృతిక వారసత్వ సంపదనంతటినీ ఆధారం చేసుకున్నారు. వర్గపోరాట సూత్రం అనేది శాశ్వతమైందిగా, మార్పు వుండనిదిగా మార్క్సెన్నడూ భావించలేదు భవిష్య సమాజ వ్యవస్థలోకి పరివర్తనకు సాధనంగా ఆ సూత్రాన్ని ఆయన నొక్కి చెప్పారు. ఆర్థిక రంగంతో సహా కార్యకలాప రంగాలన్నిటి నుంచీ స్వతంత్రుడుగా వ్యక్తి రూపొందగల స్వేచ్ఛాయత వ్యక్తి ఆవిర్భావం జరిగే సమాజాన్ని నెలకొల్పడం ఆయన ఆదర్శం.

మార్క్సిజంలోని మానవతా వాద అంశానికి గల ప్రాధాన్యతను తగ్గించడమూ భక్కోనంద ర్ధంలో వక్రీకరించడమూ తదనంతర కాలంలో జరిగింది. కమ్యూనిస్టు ప్రణాళికలోనూ దాస్ కాపిటల్‌లోనూ కూడా పెట్టుబడిదారీ ఆస్తిని రద్దు చేయాలని మార్క్సు సూచించారు. అంతే తప్ప వ్యక్తి శ్రమ ఆధారంగా సంపాదించుకున్న చిన్న ప్రయివేటు ఆస్తిని కాదు. అయితే అన్ని రూపాల ప్రయివేటు ఆస్తినీ రద్దు చేయాలనే డిమాండ్‌ను మార్క్సుకు అంటగట్టే ప్రయత్నం జరిగింది. ఒక స్వేచ్ఛాయుత వ్యక్తిని రూపుదిద్దేందుకు వ్యష్టి శ్రమ అనేది చారిత్రకంగా తప్పించ వీల్లేని పూర్వాపేక్షితం అని మార్క్సు పేర్కొన్నారు. కంప్యూటర్ విప్లవంవల్ల "నవకౌశల్యాలు" ఆవిర్భవించిన యీ చారిత్రక దశ కొత్త మలుపులో మార్క్సు ఆలోచనలు మరింత ప్రాముఖ్యత సముపార్జించుకున్నాయి.

సమావేశాన్ని నిర్వహించిన శాఖాధిపతి బి. క్రోవల్ (డి ఎస్సి చరిత్ర) ముగింపు ప్రసంగం చేశారు. ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన వివిధ శాఖల నుంచి 20 మందికి పైగా పండితులు యిందులో పాల్గొన్నారు. యిదే చర్చకు ఆరంభంగాబట్టి విషయాన్ని విస్తరించి పేర్కొనడం జరిగిందని అయితే భవిష్యత్తులో మరింత నిర్దిష్టమైన సమస్యలపై చర్చ అభిలషణీయమనీ ఆయన అన్నారు.

నూతన ఆలోచనా ధోరణి, దానిని వర్తింప చేసే రంగాలు, కాలం చెల్లిన, యిప్పటికీ విలువగల అంశాలు మొదలైన విషయాలను గురించి ఘాటుగా వాద వివాదాలు సాగుతున్నాయి. అయితే అతి ముఖ్యమైన విషయం ఒకటుంది దానిని విస్మరించరాదు. : శాంతిని రక్షించడం కోసం పోరాటం వర్తమాన కాలపు అత్యంత ప్రధాన కర్తవ్యం.



**20 వ శతాబ్దపు మహా మేధావుల్లో వ్లదీమిర్ వెర్నాద్‌స్కీ (1863-1945) ఒకరు. ఆయన విజ్ఞాన శాస్త్ర పరమైన అన్వేషణల గురించిన ప్రతి ఒక్క విషయం మనకు యీనాడు అవగతమైనట్టు కన్పిస్తున్నది. ఖనిజశాస్త్రం, భూరసాయన శాస్త్రం, భూజీవ రసాయనశాస్త్రం, రేడియాలజీ, స్ఫాటికశాస్త్రం, మట్టిని గురించిన అధ్యయనాలు, భూగోళ శాస్త్రం, విజ్ఞాన శాస్త్ర చరిత్ర గురించిన ఆయన రచనలు యేనాడో ప్రామాణిక గ్రంథాలయ్యాయి. అయినప్పటికీ "వెర్నాద్‌స్కీ క్రమం" గురించిన రహస్యానికి సరియైన సమాధానం కనుగొనడానికి చాలామంది పండితులు యిప్పటికీ ప్రయత్నిస్తున్నారు. యీనాడు అంటే నూతన సహస్రాబ్ది ప్రాంగణంలో కూడా ఆయన వూహాలను, మన భూగోళపరిణామానికి సంబంధించిన ఆయన ప్రగాఢమైన, విస్తృతమైన విశ్లేషణలను మనం సమగ్రంగా అవగాహన చేసుకోలేక పోతున్నాం. ఆయన కాలంలోనే యింతటి ప్రగాఢమైన ఆలోచనలను ముందుకు తెచ్చిన మేధావి వెర్నాద్‌స్కీ.**

అంతరిక్షంనుండి భూగోళాన్ని తిలకిస్తే యెలావుంటుందో ఆ చిత్రాన్ని వెర్నాద్ స్కీ వీక్షించాడు.

1926లో లెనిన్ గ్రాడ్‌లో ప్రచురించిన "జీవావరణము" అనే పుస్తకం ఆయన సుదీర్ఘ ఆలోచనా కృషి, పరిశోధన, వాస్తవాల ఆపోశన ఫలితం

# మన భూగోళాన్ని ఆవిష్కరించిన మనీషి

ఆర్. ఫ్యోదరవ్

స్విస ఆల్ప్సుకు తాను జరిపిన పర్యటనల వల్ల యేర్పడిన అభిప్రాయాలను తన భార్యకు ఒక లేఖలో తెలిపాడు. అప్పుడు ఆయన వయస్సు 30 మాత్రమే.

"నాచుట్టు ప్రక్కల్లోనే నియమాలను కనుగొంటున్నట్టు నేను భావిస్తున్నాను. ఒక గ్రహమైన, భూమి సంపూర్ణ చిత్రాన్ని కనుగొనేందుకు నా బుర్ర శ్రమిస్తున్నట్టు నేను భావిస్తున్నాను. యెంతటి కష్టమైన పని యిది! అయి తే శ్రమించినా కొద్దీ యీ చిత్రం మరింత స్పష్టమౌతున్నట్టు కనిపిస్తోంది. సౌరశక్తితో సృష్టి అయినట్టి భూమ్మీది రసాయనిక జీవుల ఉజ్వల సాధారణ నమూనా అప్పుడప్పుడు నా మనోఫలకంపై పడుతున్నది."

అప్పుడు కూడా కొందరు ఆయనకన్నా ముందుగానే భూమిని అంతరిక్షంనుండి వీక్షించారు ఉదాహరణకు, సూర్యకేంద్రసిద్ధాంత కర్త అయిన నికోలస్ కోపర్నికస్‌ను, లేదా గ్రహాల గతుల నియమాల నిర్వచించిన ఇసాక్ న్యూటన్‌ను తీసుకోండి. వారి దృష్టిలో భూమి, ఒక అమూర్తమైన అంతరిక్ష వస్తువుగానే వుండింది. భూమిని గురించిన వెర్నాద్ స్కీ అభిప్రాయం పూర్తిగా భిన్నమైనది. భూగర్భశాస్త్రవేత్త, రసాయన శాస్త్ర వేత్త అయిన వెర్నాద్ స్కీ భూమిని ఒక నిర్దిష్ట మైన, సుస్పష్టమైన వస్తువుగానే గాక దాని బిలియన్ సంవత్సరాల చరిత్రను కూడా దర్శించాడు. ప్రఖ్యాత ద్మిత్రి మెండెల్యేవ్ ఆయనటీచర్లలో ఒకరు.

"భూమ్మీది వివిధ ప్రాంతాల్లో జరిగిన రసాయనిక ప్రతి చర్యల ఫలితమే ఖనిజాలు; మనకు తెలిసిన నియమాల ప్రకారమే ఆ ప్రతిచర్యలు జరిగాయి. కాని భూమి యిన్నాళ్లుగా లోనైన విస్తృత మార్పులతో వాటికి సన్నిహితసంబంధ ముందని మనం భావిస్తున్నాం."

ఇది తన భార్యకు వెర్నాద్ స్కీ 24 యేళ్ల వయస్సులో అంటె 1888లో రాసిన లేఖలోని భాగం. ఆస్ట్రియాలోని ఆల్ప్స పర్యటన అనంతరం యీ లేఖ రాశాడు. యీ విజ్ఞాన వేత్తనిర్విరామ నికరకృషిని యీ లేఖలు తెలియజేస్తు న్నాయి.

పైన పేర్కొన్న లేఖలకు ముందుగా రాసిన ఒక లేఖలో ఆయన యీ అభిప్రాయం వెల్లడించారు:"స్వభావరీత్యానేను స్వాప్నికుణ్ణి·అది ప్రమాదకరమైన లక్షణం. నేను యేదో ఒక లోపభూష్టమైన లేదా మోసపూరితమైన భావాల్లో కొట్టుకుపోయి, ఆగాధాల్లోకి దింపే మార్గంలో పయనిస్తానని నేను స్పష్టంగా అవగాహన చేసుకున్నాను; అయితే ఆ పథంలో పయనించడానికి నేను వెనుకాడను; నా ఆలోచనలకు గల శృంఖలాలంటే నాకు అసహ్యం; ఆచరణరీత్యా ముఖ్యమైన పథంలో పయనించాలని నామనస్సును బలవంతపెట్టను, పెట్టజాలను. అది నన్ను చికాకుపెట్టే సమస్యలను బాగా అవగాహన చేసుకోకుండా నిరోధించవచ్చు. జ్ఞాన తృష్ణకన్నా సందేహబలంకన్నా బలమైనది మరొటిలేదనే విషయం తెలుసా ? వాస్తవాల పరిజ్ఞానంతో "ఎందుకు" అనే ప్రశ్నలు వేసుకున్నప్పుడు, వాటికి తప్పనిసరిగా సమాధానాలను, వివరణ

లను పొందగలం. సకల శాస్త్రీయ కార్యకలాపాలకు ఆజిజ్ఞాసే, కృషే పునాది; అదే పుస్తకాల పురుగు గామారకుండా మనల్ని నిరోదిస్తుంది; అదే నిండు మనసుతో జీవించడానికీ, విజ్ఞాశాస్త్ర ప్రాజెక్టుల్లోని, విజ్ఞానశాస్త్ర సమస్యల్లోని కష్టసుఖాల్లో మునిగితేల డానికి మనల్ని పురిగొల్పుతుంది.''

పాటకచేరీల గురించి, వస్తుప్రదర్శనశాలల సందర్శన గురించి ఆయన అభిప్రాయాలు, నగరాల, ప్రకృతి దృశ్యాల వర్ణనలు ఆయన రాసిన అనేక లేఖల్లో చెదురుమదురుగా వున్నాయి. వీటినిబట్టి వెర్నాద్‌స్కీకి అనేక విషయాలపట్ల ఆసక్తి, జీవితం పట్ల ఆయనకుగల పరిపూర్ణ భావన వ్యక్తమౌతుంది.

ఇక, ఖనిజాల విషయానికి వద్దాం. యిప్పటి వరకూ ఒకే శాస్త్రంగా పరిగణిస్తూ వచ్చిన దానిని రెండు శాస్త్రాలుగా ఆయన యేనాడో విభజించాడు: స్ఫటికాలు; ఖనిజాలు. భూగర్భసంబంధమైన, ఖనిజ సంబంధమైన వస్తువులను సేకరించిన వారు యీ రెండూ ఒకే శాస్త్రానికి సంబంధించిన వని భావించడం కద్దు. కాని వెర్నాద్ స్కీ మరో విధంగా ఆలోచించారు. ''స్ఫటిక శాస్త్రం అనేది ఘన రూపంలో వున్న వస్తువు తాలూకు భౌతిక, రసాయనిక ధర్మాలను బోధిస్తుంది. ఖనిజశాస్త్రం అనేది గ్రహాల మీద, ముఖ్యంగా భూమ్మీద జరిగే రసాయనిక ప్రతి చర్యలగురించి బోధిస్తుంది.''

''ముఖ్యంగా భూమ్మీద'' అని వెర్నాద్‌స్కీ చేసిన వ్యాఖ్యకు ప్రగాఢ అర్థముంది. యిది ఆయన సునిశిత పరిజ్ఞానానికి తార్కాణం. భూమ్మీదగల యే ఖనిజమైనా సరే పరమాణువులాగా యేనాడూ మార్పు చెందదని ఆయన అభిప్రాయపడలేదు. వాటిని ఆయన చారిత్రక దృష్టితో, భూగర్భ పరిణామ క్రమంలో భూమిపై పొరలో వచ్చిన మార్పుల దృష్టిలో పరిశీలించాడు. ఖనిజం ఒక విధంగా సజీవమైనది: అవి తమ చరిత్రలోని ఒక దశలో రూపొందుతాయి. పలురకాల రసాయనిక, భౌతిక శక్తుల ప్రభావంతో పరిసరాల్లోని రసాయనాల వల్ల వెలుగులోకి వస్తాయి. కాలానుగతంగా పనిచేసే యీ శక్తులే ఖనిజాల్లో మార్పులు తెస్తాయి లేదా వాటిని నాశనం చేస్తాయి.'

ఖనిజాలపై తన దృష్టిని కేంద్రీకరించి, వాటి సృష్టిలేదా నాశనానికి దారి తీసిన పరిస్థితులను, క్రమాలను కనుగొనడం ద్వారా జెనెటిక్ మినరాలజీకి వెర్నాద్‌స్కీ పునాదులువేశాడు.

ఖనిజా లను వాటి అంశీభూతాలైన రసాయనాలుగా విడదీసి, భూమిపై పొరలో వాటి వంపిణీ నియమాలను అధ్యయనం చేసి వెర్నాద్ స్కీ పూర్తిగా ఒక నూతన శాస్త్రాన్ని — భూగర్భ రసాయనశాస్త్రాన్ని — స్థాపించారు.

వెర్నాద్‌స్కీ స్థాపించిన, ఆయన పేరుతోనే ప్రసిద్ధిచెందిన జియో కెమిస్ట్రీ, అనాలిటికల్ కెమిస్ట్రీ విషయాల యు.ఎస్.ఎస్.ఆర్. అకాడమీ ఇనిస్టిట్యూట్‌లోని పరిశోధకులు చంద్రుని మట్టి మచ్చులను పరిశీలిస్తున్నారు. వీరు కుజగ్రహం మట్టి విశ్లేషణ సమాచారాన్ని సాధారణీకరిస్తున్నారు. యీ విశ్లేషణను అంతర్‌గ్రహకేంద్రాలు అందజేశాయి. యీ పరిశోధనవల్ల భూగర్భ రసాయనశాస్త్రమేగాక, చంద్రునికి, కుజగ్రహానికి, శుక్రగ్రహానికీ సంబంధించిన రసాయన శాస్త్రాలు అభివృద్ధి చెంది అవి ఆ తర్వాత గ్రహాలకు సంబంధించిన రసాయన శాస్త్రంగా విలీనమయ్యే సదవకాశాలున్నాయి.

అంతరిక్షంనుండి భూమిని పరిశీలించడమనేది వెర్నాద్‌స్కీకి సంతోషకరమైన అంశంగానే వుండింది. కాని భూమిపై జరుగుతున్న ఘటనల పట్ల ఆయన యెంతో శ్రద్ధ కనబర్చారు. యెందుకంటే యిది ప్రాణికోటిగల, మానవాళిగల ప్రత్యేక గ్రహం. వి.వి.దొకుచయేవ్ వెర్నాద్‌స్కీకి అధ్యాపకుడు. ఆ మహోపాధ్యాయుడు నేలలకు సంబంధించిన ఆధునిక శాస్త్రానికి పునాది వేశాడు. నేల అనేది సజీవ పదార్థం కాక పోయినప్పటికీ దాని అత్యంత ముఖ్య స్వభావాన్ని మొదట పేర్కొన్నది, ఆయనే.

అయితే నేలలకు సంబంధించిన పూర్తి వాస్తవాలు యివేనా? 1906 లో, అంటే ''జీవ్యావరణము'' అనే తన పుస్తకావిష్కరణకు 20 యేళ్ల పూర్వమే వెర్నాద్ స్కీ తన డైరీలో రాసుకున్న విషయముంది. అది నేలలకు సంబంధించి తన అన్వేషణకు సిద్ధంచేసుకున్న పథకం.

''జీవ్యావరణము'' వెలువడిన తర్వాత పదేళ్ళకు అంటే 1938 లో వెర్నాద్‌స్కీ "గ్రహపరిణామక్రమంపై ఒక శాస్త్రీయ ఆలోచన" అనే సిద్ధాంత పత్రాన్ని రచించాడు; ఆయన జీవితకాలంలో అది ప్రచురణ భాగ్యానికి నోచుకోలేదు. భూగోళంపై మానవ

కార్యకలాపాల తాలూకు భూగర్భ సంబంధపాత్ర గురించిన ప్రశ్నలకు సమాధానాలు అందులో వున్నాయి.

"మొట్టమొదటి సారిగా మానవుడు తన జీవితం ద్వారా, సంస్కృతి ద్వారా భూగోళపు మొత్తంపై పొరకు అంటే మొత్తం జీవ్యావరణానికి, భూమ్మీది మొత్తం మండలానికి పరివ్యాప్తమయ్యాడు అది అతని జీవితంతో ముడిపడి వుంది.

"కొత్త భూగర్భసంబంధమైన కారకం శక్తిలోనూ, పారంపర్యతలోనూ దానికదేసాటి. జీవ్యావరణలో దాని సృష్టిలో మనం పాల్గొంటున్నాం; దాని వునికిని చూస్తున్నాం. అది 20,000 నుండి 30,000 సంవత్సరాలనుండి వునికిలో వుండని శాస్త్రీయ ప్రాతిపదికపై రుజువుచేయడం జరిగింది. గత వెయ్యేళ్ళ నుండి అది నానాటికీ వేగంగా పెరుగుతున్నట్టు సుస్పటంగా అవగతమౌతోంది."

నిజంగానే అది అతివేగంగా అభివృద్ధి చెందుతోంది. వెర్నాడ్‌స్కీ 1913లో టోరంటో (కెనడా)లో జరిగిన ప్రపంచ భూగర్భశాస్త్రవేత్తల సమావేశంలో పాల్గొన్నాడు ఆ వేగం తాలూరు కఠోరమైన పర్యవసానాలను ఆయన స్వయంగా చూశారు.

"యీ నూతన సాంకేతిజ్ఞతకు-మానవాళికి యెంతో దోహదం చేసిన యీ అమెరికన్ సాంకేతిజ్ఞతరు-దుష్ట పార్శ్వంకూడా వుంది. దీన్ని యిక్కడ అంతటా చూస్తున్నాం. అందమైన దేశం అందవిహీనమైపోయింది. అడవులను తగలబెట్టారు. చుట్టూ మైళ్లకొలది భూభాగం యెడారిగా మారిపోయింది; పైరు పచ్చలు విషమయమైపోయాయి. వాటిని తగల బెట్టారు. — నికిల్ వుత్పత్తే దీనంతటికీ కారణం. యిదీ యీనాడు ప్రపంచానికి కేంద్రమైంది : ప్రపంచంలోని నికిల్‌లో యెక్కువ భాగం యిక్కడే వుత్పత్తి చేస్తారు. కాని దేశంలోని కొంత భాగం శిలామయమైన యెడారిగా మారిపోయింది"

గనులను, ఫ్యాక్టరీలను సందర్శించిన అనంతరం తన యీ అభిప్రాయాలను తన భార్యకు రాసిన లేఖలో ఆయన తెలియ జేసారు.

భూమ్మీద మానవుని కార్యకలాపాలవల్ల సృష్టి అయి న తీవ్ర సమస్యలను ఆయన స్పష్టంగా అవగాహన చేసుకున్నారు. శక్తిలోనూ, పరిధిలోనూ వాటిని భూగర్భసంబంధమైన కారకంగా ఆయన పరిగణించారు.

"వ్యాసాలు, వుపన్యాసాలు" అనే తనపుస్తకానికి 1921 లో ఆయన రాసుకున్న ముందు మాటలో భావిదర్శన చేశారు. "మానవుడు అణుశక్తిని పొందేసమయం త్వరలోనే వస్తుంది. మానవుడు తన జీవితాన్ని కోరుకున్న పద్ధతుల్లో నిర్మించుకోడానికి ఆశక్తితోడ్పడుతుంది. అది రానున్న కొద్ది సంవత్సరాల్లోనే, ఒక శతాబ్దకాలంలోనో సాధ్యంకావచ్చు. అది జరిగి తీరుతుందనేది మాత్రం ఖాయం.

"ఆ శక్తిని మానవుడు స్వయం నాశనానికి కాకుండా మంచి ప్రయోజనాల కోసం వినియోగిస్తాడా?

"విజ్ఞాన శాస్త్రం అతనికి తప్పకుండా ఒనగూర్చే ఆ శక్తిని వినియోగించుకునే పరిణతి అతనికి వుంటుందా.?

"విజ్ఞాన శాస్త్రవేత్తలు తమ శాస్త్రీయ కృషి, శాస్త్రీయ క్రమాల పర్యవసానాల పట్ల కళ్ళు మూసుకొని వుండకూడదు. తమ ఆవిష్కరణల వల్ల సంభవించే పర్యవసానాలన్నిటి పట్ల బాధ్యతా భావంతో వుండాలి. వారు తమ కృషిని మొత్తం మానవాళి సంక్షేమంతో ముడి పెట్టాలి "

ఈ శాస్త్రవేత్త 1945 జనవరిలో అంటే హిరోషిమా, నాగసాకీలపై అణుబాంబులు వేయడానికి కొన్ని నెలల ముందు మరణించాడు. ముందు సంభవించనున్న ప్రమాదాన్ని వెర్నాడ్‌స్కీ పసిగట్టి కూడా మానవాళి ప్రగతి మార్గాన సాగుతుందనీ, భూమ్మీద జీవసంబంధమైన సముతూకాన్ని కాపాడుతుందనీ ఆశావాదాన్ని వ్యక్తం చేశాడు. తన ఆశావాదాన్ని ఆయన యిలా వ్యక్తం చేశాడు మానవాళి కృషివల్ల విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానంతో సస్మృద్ధమైన జీవ్యావరణం హేతుబద్ధమైన ఆవరణంగా మారాలి.

"బిలియన్లాది సంవత్సరాలుగా జరుగుతున్న క్రమాలు తాత్కాలిక మైనవిగా వుండకూడదు; వాటిని నిలిపివేయవీలులేదు. దీనర్థం జీవ్యావరణం హేతుబద్ధమైన ఆవరణంగా తప్పకుండా మారుతుంది. జీవ్యావరణంలో నివసిస్తున్న ప్రజల జీవిత కాలంలోనే ఆ ఘటనలు జరుగుతాయి. ఆ ఘటనలు ఆక్రమానికి అవసరమైనవి. దానికి విరుద్ధమైనవిగా వుండకూడదు."

విజ్ఞానశాస్త్రవేత్తగా తన జీవితాన్ని ప్రారంభించినపుడు "నేను ఒక స్వాప్నికుణ్ణి" అని వెర్నాడ్‌స్కీ అన్నాడు. విజ్ఞాన శాస్త్ర పరమైన ఆయన అన్వేషణ ఫలితాల ఫలదాయకత సుదీర్ఘమైన సంఘటనా భరితమైన ఆయన జీవితం తెలియజేస్తోంది.

ల్యుకిన్ : ఈ శతాబ్దీ, సహస్రాబ్ది ముగియవస్తున్నప్పుడు ప్రపంచ పరిస్థితికి లక్షణంగా మూడు ప్రధానాంశాలున్నాయి. ఇవి : పెరుకపోతున్న ఆయుధరాసుల మూలంగా వుత్పన్నమైన ప్రపంచ మహోపద్రవ ప్రమాదం; విషమిస్తున్న జీవ్యావరణసంక్షోభం; ప్రపంచంలోని సంపన్న దేశాలకూ, బీద దేశాలకు మధ్య పెరుగుతూన్న అంతరం.

బొవిన్: సంక్షోభాలూ, వైరుధ్యాలూ వైపరీత్యాలూ నిండుకొన్న వాతావరణంలో మానవాళి మూడవసహస్రాబ్దిలో అడుగిడబోతూంది కాని, ప్రాక్ పశ్చిమాల మధ్య గల తేడాలను , సమస్యల స్థాయీభావాల్లో గల తేడాలను మనం గమనించడం అవసరం. 20వ శతాబ్ది, ఒకప్రపంచ వ్యవస్థగా సోషలిజం నెలకొన్న శతాబ్ది. ఇది నిర్వివాదమైన వాస్తవం. కాని సోషలిజం పెట్టుబడి దారీ విధానం కన్న ఫలప్రదమైన ఆర్థికవ్యవస్థను యింకా నిర్మించలేకపోయిందని మనం ఒప్పుకోక తప్పదు. హంగరీ, జెకొస్లొవాకియా, చైనా, పోలండ్ వంటి పలు సోషలిస్టు దేశాల్లో ఆంతరంగిక సంక్షోభాలు సంభవించాయి.

ల్యుకిన్ : ఇదే కాక, డెబ్భైదశాబ్ది చివరి సంవత్సరాల్లోనూ, యెనభయ్యవ దశాబ్దితొలి సంవత్సరాల్లోనూ సోవియట్ యూనియన్‌లో రూపుగొన్న పరిస్థితిని కూడ పేర్కొనాలి. ఇది దేశాన్ని సంక్షోభందరిదాపులకు నెట్టిందని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ చెప్పింది.

బొవిన్ : పెట్టుబడి దారీ ప్రపంచంలో అన్ని జీవితరంగాలకూ సంక్షోభం ఆవరించిందన్న వాస్తవాన్ని కూడ యెవరూ కాదనలేయి కదా. పరిస్థితిని గమనిస్తే, దీనిలో పోలూపొందికా లేదన్న అభిప్రాయం కలుగుతుంది. ఒకవైపు మానవ మేధస్సు విజయ పతాకను ఎగురవేస్తుండగా మరోవైపు సాంస్కృ తిక పతనావస్థ కనిపిస్తోంది. వర్గచ్యుత జ్యంపాలు విస్తరిస్తున్నాయి.

ల్యుకిన్ : పాత, సాంప్రదాయక ఆలోచనా విధానం త్వరగా అంతరిస్తోంది; కాని మనం సంప్రదాయాలను బద్దలు చేస్తున్నంత త్వరితగతిలో నూతన సామాజిక జీవిత రూపాలను సృష్టిస్తున్నట్లు కనిపించడం లేదు.

బొవిన్ : ఈ శతాబ్దాంతంలోని నైతిక వాతావరణంలో లక్షణమేమంటే, వామపక్షాల్లో అసంతృప్తివల్ల, భ్రమలు తొలగి పోవడంవల్ల కలిగే ఆశాభంగం పెరుగుతున్నది. అనేక పార్టీ కార్యక్రమాలు. విధాన పత్రాలు ఆచరణరూపం దరించ.

# నూతన శతాబ్ది ప్రాంగణంలో

దీనికి ముందటి సోవియట్ సమీక్షలో అకాడమీషియన్ షాక్నాజరోవ్ అభిప్రాయం తెలుసుకున్నాము. కింది సంభాషణలో, సోవియట్ ప్రభుత్వ దినపత్రిక ఇజ్వెస్తియా రాజకీయ విశ్లేషకుడు అలెగ్జాండర్ బోవిన్, చరిత్రలో ఆచార్యుడు డాక్టర్ వ్లదీమిర్ల్యుకిన్ ప్రపంచ ప్రధాన సమస్యలపై వివాదగ్రస్తమైన అభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నారు

లేదు. సోషల్ — డెమొక్రటిక్ ఉద్యమం పెట్టుబడీదారీ విధానాన్ని "మానవతాయుతం" చేస్తాననీ, "సంక్షేమరాజ్యాన్ని" సృష్టిస్తాననీ వాగ్దానం చేసింది. అది కార్మికుల జీవితంలో కొన్ని మెరుగుదలలను తెచ్చిందే, కాని "సంక్షేమరాజ్యం" వల్ల కలిగే మేలును యావన్మంది ప్రజల అందుబాటులోకి తేలేక పోయింది. కమ్యూనిస్టులు ప్రకటించిన లక్ష్యాలు కూడ యెన్నో యింకా సాధించడం జరగలేదు.

ఏదియేమైనా, సామ్రాజ్య వాదస్థానాలు నాటకీయంగా విచ్ఛిన్న మయాయి. రాజకీయ, ఆర్థిక పీడనకు సంబంధించిన అతిదారుణమైన రూపాలు నిర్మూలనమయాయి. కాని ఈ వ్యవస్థ గండాలనుంచి బయటపడి, నూతన సామాజిక చారిత్రక వాస్తవాలకు అనుగుణంగా తన్ను తాను మలచుకోగలుగుతుందని, పెట్టుబడి దారీ విధానాన్ని విమర్శించే వారిలో యెవరూ ఊహించలేదు విప్లవఫలితంగా పెట్టుబడిదారీ విధానం వేగంగా పతన మవుతుందని ఈ శతాబ్ది ప్రారంభంలో అనుకొన్నాము. కాని ఆనాడు అనుకొన్నంత వేగంగా అది పతనమవుతుందని ఈనాడు, ఈ శతాబ్దాంతంలో మనం అనుకోవడం లేదు.

ల్యుకిన్ : మనకు విషయ పరిజ్ఞానమూ, ఆశావాదమూ రెండూ వుండవచ్చుననుకొంటాను.

మన ఆశావాదానికి 1917 నాటి రష్యామూలం. అక్టోబరు విప్లవం రష్యాచరిత్రనే కాక ప్రపంచ చరిత్రను కూడ మార్చి వేసింది. అది ఈ శతాబ్దిలో కెల్లా ముఖ్య ఘటన. పెరిస్త్రోయికా అనే ప్రస్తుత సంస్కరణోద్యమం అక్టోబరు విప్లవ ప్రత్యక్ష కొనసాగింపుగా సమాజం పరిగణిస్తోంది. ఆనాటి విప్లవం తెచ్చినంతటి ముఖ్యమైన మార్పులను తేగలశక్తి పెరిస్త్రోయికాకూ వుంది. పార్టీలో ఆత్మవిమర్శస్థాయి, సోవియట్ సమాజజీవితరంగాల్లో ఆ మూలాగ్ర సంస్కరణలకై సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ 1987-88 ప్లీనరీ సమావేశాలు ఆమోదించిన కార్యక్రమం, ఆర్థిక సంస్కరణలకు హామీగావుండగల ప్రజాతంత్రీకరణ విధానం — వీటన్నిటినీ బట్టి పెరిస్త్రోయికా జయప్రదమవుతుందన్న ఆశాభావంతో మనం వుండవచ్చు. విదేశాంగ విధానరంగంలో మన ఆశావాద దృక్పథానికి కూడ కారణం పెరిస్త్రోయికాయే. పెరిస్త్రోయికాను ముఖ్యంగా సామాజికరంగంలో మనం యెంత గట్టిగా అమలు జరిపితే పాశ్చాత్య దేశాల్లో వామపక్షశక్తులకు అంత యెక్కువ అవకాశాలను కల్పించిన వారమవుతాము.

అదే సమయంలో, ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్న మార్పులను దృష్టిలో వుంచుకోవాలి కార్మికవర్గ పనిపరిస్థితులూ, దాని సామాజిక దృష్టీ మారుతున్నాయి. పింఛన్‌దార్ల సంఖ్య నిరుద్యోగభృతిపై బతికే వార సంఖ్య పెరుగుతోంది. పలు పెట్టుబడిదారీ దేశాల్లో ట్రేడ్ యూనియన్లు తమ స్థానాలను కోల్పోతున్నాయి

పాత సామాజిక అనుబంధాలు సడలుతున్నాయి; కొత్తవి తలెత్తుతున్నాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే ప్రపంచసామాజిక స్వరూపమే మారిపోతూంది.

బోవిన్ : ప్రపంచ సామాజిక స్వరూపం మారుతుంది. కాని సామాజిక భవిష్యత్ రూపం గురించిన అవగాహన కూడ మారుతుందని చెప్పవచ్చు. సోషలిస్టు మార్పునకు పెట్టుబడి దారీ విధానం వస్తుగతంగా యేనాడో పరిపక్వమయిందనీ, ఆ మాటకొస్తే మాగిముగ్గిందనీ తరచు వాదిస్తున్నారు. కానీ, ఈ చారిత్రక ధోరణిని ఆచరణలోకి తేగల ఆత్మగతశక్తి కార్మిక వర్గంలోని చీలికల

వల్ల, సోషల్ — డెమొక్రటిక్, కమ్యూనిస్టు పార్టీల మధ్య విభేదాల వల్ల, బూర్జువా వర్గం ప్రజానీకాన్ని సైద్ధాంతికంగా పెడతోవపట్టించడం వల్ల బలహీనపడిపోయిందని అంటున్నారు.

పెట్టుబడిదారీ విధానం, మార్పునకు పరిపక్వంగా వుందన్న వాదననే తీసుకొని చూద్దాం అలా చెప్పేవారు పెట్టుబడి దారీ విధాన పరిధిలోనే ''పునర్వ్యవస్థీకరణకు''గల అవకాశాన్ని తక్కువ అంచనా వేస్తున్నారు. ఇక ఆత్మగత శక్తుల సంగతికి వస్తే ఆయా దేశాల రాజకీయ జీవితంలో ఆశక్తుల వాస్తవ పాత్రను మనం తరచు యెక్కువ అంచనా వేశాం.

ల్యూకిన్ : మరో విషయం కూడ నేను పేర్కొనదలచాను. బూర్జువానాయకులు సృష్టించగలిగిన ప్రతి క్రియావ్యవస్థ ప్రజల జవసత్వాలను సంస్కరణవాదం ఆధునికీకరణలవైపుగా, పెట్టుబడీదారీ విధానాన్ని ''మెరుగుపరచే'' వైపుగా మళ్ళించింది. వేరు మాటల్లో చెప్పాలంటే, బూర్జువా నాయకులు వెసులు బాటుతో వ్యవహరించగల రాజకీయ చాతుర్యం చూపారు. వామపక్ష ఉద్యమాలు తమ పిడివాద వైఖరులకు యెంతో మూల్యం చెల్లించవలసివచ్చింది. ఈ వైఖరులు శూన్యం నుంచి వుత్పన్న మైనవికావు. స్వచ్ఛమైన కొత్తగాలి లేని ఫలితమవి. సోవియట్ యూనియన్ చేపట్టిన పెరిస్త్రోయికావిధాన వుద్దేశ్యం యిటువంటి గాలిని తీసుకరావడమే.

బోవిన్ : నిజంగా పెట్టుబడిదారులు చాలా విషయాలు నేర్చుకొన్నారు, రాజకీయాల్లో ఆర్థికవ్యవహారాల్లో చాలా మారిపోయారు అందువల్ల సామ్రాజ్యవాద చోదకశక్తులను అధ్యయనం చెయాలి

లెనిన్ కాలంలో గుత్త పెట్టుబడీదారీ విధానం పెట్టుబడిదారీ వ్యవస్థ తాలూకు ప్రబల రూపం, ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానం అప్పుడప్పుడే తల యెత్తుతూండింది. ఈ శతాబ్దిచరమార్ధంలో ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానం, ప్రత్యేకించి దాని బూర్జువాసంస్కరణ వాద రూపాంతరం ప్రాబల్యం వహించింది. గుత్తపెట్టుబడిదారీ విధాన అంశాల మీద ప్రభుత్వ అంశాలు క్రమేణా పై చేయి సాధించడం, తుదకు యిది ''అచ్చమైన'' ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానానికి దారితీయడం సైద్ధాంతికంగా సాధ్యమే.

పరిస్థితి యింతకన్న జటిలంకావచ్చు. బహుళ జాతి గుత్త సంస్థల, బ్యాంకుల పలుకుబడి పెరగడం, ప్రభుత్వ గుత్తపెట్టుబడీదారి విధానం తాలూకు బహుళజాతి నమూనారూప ఆవిర్భావంగా పరిగణించవచ్చు

ల్యూకిన్ : ''సామ్రాజ్యవాద స్వభావం'' గురించి మీరేమి చెబుతారు? సైనిక వాదం, రాజకీయ, ఆర్థిక పెత్తనానికై పాకులాట దానిలో భాగమని మనకు తెలుసు. ''సామ్రాజ్యవాద స్వభావం'' ఒక చారిత్రక స్థిరాంశమా? లేక అది మారగలదా?

**బోవిన్:** "చారిత్రక స్థిరాంశం'' అన్న పదాన్ని నేను వాడను. చరిత్రలో మార్పూ, అభివృద్ధి, పరిణామక్రమమూ గర్భితం వాటిని యే ''స్థిరాంశాలూ'' ఆపలేవు.

అసలు విషయమేమిటంటే, ''సామ్రాజ్యవాద స్వభావానికి'' స్వతస్సిద్ధమైన ఉనికి లేదు. అదొక

పెరిస్త్రోయికా అనే ప్రస్తుత సంస్కరణోద్యమం అక్టోబరు విప్లవ ప్రత్యక్ష కొనసాగింపుగా సమాజం పరిగణిస్తోంది. ఆ నాటి విప్లవం తెచ్చినంతటి ముఖ్యమైన మార్పులను తేగల శక్తి పెరిస్త్రోయికాకూ వుంది.

ఎ.ల్యూకిన్

అనిర్దిష్ట ఊహాత్మక భావన కాదు. వాస్తవంలో, దాన్నిసామాజిక, చారిత్రక అంశాలు ప్రభావితం చేస్తాయి. (అయితే దీని వల్ల అది ''మంచిది'' గా మారదు) యుద్ధం, లేదా బలప్రయోగం తనకిక ప్రయోజనకరం కాని పరిస్థితి, లేక తన ప్రయోజనాలకే ముప్పుతెచ్చే పరిస్థితి యేర్పడితే, సైనిక వాదానికి గల అవకాశాలను బాగా తగ్గించడం జరుగుతుంది. దాని ''స్వాభావికమైన'' దురాక్రమణతత్వం అలాగే వున్నప్పటికీ, సామ్రాజ్యవాదం బహుశా రాజకీయాల్లో తన దురాక్రమణ తత్వానికి ఆచరణ రూపం యివ్వలేక పోవచ్చు.

ల్యూకిన్ : తమ చరిత్రకు భరతవాక్యం పలికే, సాంకేతిక సాధనాలను మానవులు నమకూర్చుకొన్నారు. కాబట్టి మీరన్నది ముమ్మాటికీ నిజం. అణు మిసిలీలతో జరిగే ప్రపంచ యుద్ధం సర్వనాశనానికి దారి తీస్తుంది. ఈలోగా, అంతర్జాతీయ

సంక్షోభాల తీవ్రత పెరుగుతూంది.

సైనిక వాదంపై ఒత్తిడిని పెంచితే, "సామ్రాజ్య వాద స్వభావాన్ని" అణచివేయవచ్చు. కాని ప్రపంచానికి యితర రకాల ప్రమాదాలు యెదురవుతున్నాయి. వీటిని అడ్డుకొనేందుకు అవసరమైన ప్రతిఘటనను మానవాళి యింకా ఆయత్త పరచుకోలేదు.

**బోవిన్ :** అంతర్జాతీయ ఘర్షణలను అదుపులో వుంచడం, లేదా వాటిని పూర్తిగా తొలగించడం, ఆవిధంగా నాగరికత విలువలను రక్షించుకోవడం, మనిషి మనుగడకు హామీ కల్పించడం వీటిని నేర్చుకోవడం యేదో ఒక వర్గానికి. కాక, సమస్త మానవజాతికే శ్రేయస్కరం ఉమ్మడి ప్రమాదాలు

అణుయుద్ధం వల్ల రాగల వినాశకర ఫలితాలను, పాశ్చాత్య ప్రపంచంలో నిరావేశంగా ఆలోచించే రాజకీయవేత్తలు కూడా గుర్తిస్తున్నట్టు కనిపిస్తోంది. కాబట్టి పూర్వాలోచిత పథకం ప్రకారం ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించే ప్రమాదం అంతగా లేదు. చనిపోవాలని యెవరూ కోరు కోరుకదా.....

— ఎ. బోవిన్

యెదురు కావడం వల్ల, సమస్త సామాజిక వర్గాలూ, బృందాలూ తాము ఒకే గ్రహంపై జీవిస్తున్నామనీ, తమ మనుగడకు తాము కృషిచేయక తప్పదనీ గుర్తిసాయి.

**ల్యూకిన్** చారిత్రక పరిణామ క్రమప్రారంభంలోని, ఒకానొక దశలో సామాజిక, జాతీయ ప్రయోజనాలు విశ్వజనీన ప్రయోజనాలనుంచి వేరు పడ్డాయి. మూడవ సహస్రాబ్ది ప్రాంగణంలో వున్న ఈనాడు ఈ ప్రయోజనాలు మళ్ళీ సంగమించనారంభించాయి. కాని ఈ క్రమాన్ని ప్రతిఘటించే ప్రబలమైన శక్తులు యింకావున్నాయి ఈ అభివృద్ధి నిరోధక శక్తులు వచ్చే శతాబ్దిలో కూడవని చేస్తూనేవుంటాయని మనం నమ్మడానికి తగిన కారణాలు వున్నాయి. ఐతే దీనికి భిన్నంగా సర్వమానవ ప్రయోజనాలను గురించిన నూతన అవగాహనకు అనుకూలమైన దోరణి సెంపొందుతూంది. ఈ నూతన అవగాహన సూచనలు సోవియట్ యూనియన్‌లో ప్రత్యేకించి గోచరమవుతున్నాయి.

**బొవిన్ :** అణుయుద్ధం వల్ల రాగల వినాశకర ఫలితాలను, పాశ్చాత్య ప్రపంచంలో నిరావేశంగా ఆలోచించే రాజకీయవేత్తలు కూడగుర్తిస్తున్నట్లు కనిపిస్తోంది. కాబట్టి పూర్వాలోచిత పథకం ప్రకారం ప్రపంచయుద్ధాన్ని ప్రారంభించే ప్రమాదం అంతగా లేదు. చనిపోవాలని యెకరూ కోరుకోరు కదా.....

**ల్యూకిన్ :** కాని అనుకోకుండా, అకస్మాత్తుగా యుద్ధం సంభవించే ప్రమాదముంది. ఆయుధాదుల నియంత్రణకుకంప్యూటర్లను అధికాధికంగా వుపయోగిస్తున్నారు. సైనిక ప్రవమాదం అంతరిక్షానికీ, సముద్రగర్భానికీ విస్తరిస్తోంది. నిర్ణయాలు చేసే పనివికేంద్రీకృత మవుతోంది. (ఒకేఒక నిర్ణయమే ప్రాణాంతకం కావచ్చు) కాబట్టి యేదో ఒక చోట పరిస్థితి అదుపు తప్పే ప్రమాదం హెచ్చింది.

**బొవిన్ :** ఎవరేమి చెప్పినా, అణ్వాస్త్ర విసర్జన అణ్వాస్త్రాల నిర్మూలన మాత్రమే మానవమనుగడకు హామీ యివ్వగలదు.

**ల్యూకిన్ :** అణ్వాస్త్రాల నిర్మూలనతో అణుయుద్ధ ప్రమాదం తొలగ వచ్చు కాని సాంప్రదాయక ఆయుధాలతో యుద్ధం సంభవించే ప్రమాదం వుంటుందా?

**బొవిన్ :** అణ్వాస్త్ర రహిత ప్రపంచం కోసం సాగుతున్న ఉద్యమాన్ని ఒకవిడి పరిణామంగాకాక ఉద్రిక్తతో పశమనంలో ఒకనూతన దశను స్థాపించే అంశంగా పరిగణించాలి. 1975 హెల్సింకీ సమావేశంతో పూర్తి అయిన దాని తొలిదశ, అణ్వాస్త్రాలను పరిమితం చేయడానికి మించి ముందుకు పోలేదు.

ఇప్పుడు ప్రారంభమయిన కొత్తదశ పాత అనుభవాలను, అణుయుగవాస్తవాలను గురించిన మరింత లోతైన అవగాహనను ఉపయోగించుకొంటోంది. అణు, సాంప్రదాయక ఆయుధాలను గణనీయంగా తగ్గించడం, పరస్పర విశ్వాసాన్ని పెంచే చర్యలు, సమగ్ర భద్రతా వ్యవస్థను నిర్మించే మార్గాన క్రమక్రమపురోగమనం — భయాన్ని అనుమానాలను తగ్గించి, రాజ్యాల మధ్య విశ్వాసాన్ని పెంచే ఈ కార్యక్రమం అణ్వాస్త్ర రహిత ప్రపంచాన్ని మనం చేరుకొనే ఒక వాస్తవిక మార్గం.

(మిరొవాయా ఎకొనామికా ఇమెజ్దునరొద్నయే ఒత్నొషెనియా

# సోవియట్-భారత ఆర్థిక, వాణిజ్య విస్తరణలో నూతన ధోరణులు

వి.పి.చావ్లా

సోవియట్ సమీక్షపత్రిక ఆధ్వరాన 1988మె24న రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది. సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య ఆర్థిక, వాణిజ్య సహకార విస్తరణ గురించి చర్చ జరిగిన యీ సమావేశంలో సోవియట్ యూనియన్, భారత దేశాల తరపున పాల్గొన్న వారు యిలాంటి సహ కారాన్ని ప్రత్యేకించి సోవియట్ కర్మాగారాది సంస్థ లకూ, భారతదేశ ప్రైవేటు రంగానికీ మధ్యగల సహకారాన్ని మరింత వైవిధ్య పూరితం చేసేందుకు భవిష్యదవకాశాలు పుష్కలంగా వున్నట్టు యేకాభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. ఉభయదేశాల మధ్యగల పరస్పర ప్రయోజనకరమైన సహకా రాన్ని గణనీయంగా విస్తంంచేందుకు ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో సాగుతున్న పెరిస్త్రోయికా క్రమం విస్తృతావకాశాలను ఆవిష్కరించిందని వారు నొక్కి చెప్పారు.

అభిప్రాయాలను పరస్పరం తెలియజేసు కునేందుకు ఇష్టాగోష్టిగా సాగిన యీసమావేశంలో చర్చను ప్రారంభిస్తూ, సహకార నూతనరంగాలను గుర్తించడంలో సోవియట్ యూనియన్ రాయబారి కార్యాలయం వెలువరించే ప్రచురణలు నిర్వహిస్తున్న ముఖ్యమైన పాత్రను గురించి సోవియట్ సమీక్ష సంపాదకుడు వై.ఎల్.ఫ్రాలోవ్ నొక్కి చెప్పారు. సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య వాణిజ్య ఆదానప్రదానాలను పెంచేందుకు అపార మైన అవకాశాలున్నట్టు ఆయన పేర్కొన్నారు. సోవియట్ యూనియన్‌లో అమలు జరుగుతున్న పునర్వ్యవస్థీకరణ విధానమూ, విదేశీ మార్కెట్లను అన్వేషించి, యితరదేశాల వాణిజ్యసంస్థలతో ఒప్పందాలుకుదుర్చు కునేందుకు సోవియట్ కర్మా గారాది సంస్థలకు యిచ్చిన హక్కూ యీ అవ కాశాలను కల్పించాయని ఆయన చెప్పారు. సహ కారంలో మరింత అభివృద్ధి అనేది భారతదేశ వాణిజ్యవేత్తల చొరవపై ఆధారపడివుందని కూడా ఆయన పేర్కొన్నారు.

సోవియట్ సాంకేతిక పరిజ్ఞానం సాధించిన ఘనవిజయాలను గురించి, వాటి శక్తిసామర్థ్యాలను గురించి ప్రస్తావిస్తూ, సోవియట్ సాంకేతికపరిజ్ఞాన

రౌండ్ టేబుల్ సమావేశంలో చర్చజరుగుతున్న దృశ్యం





కె.శం(రనారాయణన్

భారత-సోవియట్ మదుపు కేంద్రం ద్రవ్య సాంకేతిక డైరెక్టర్

విజయాలు భారతదేశ పరిశ్రమలపై చెప్పుకోదగ్గ ప్రభావాన్ని నెరపక పోవడానికి కారణమేమిటో తెలియడంలేదని సోవియట్-భారత మదుపు కేంద్రానికి చెందిన ద్రవ్య, సాంకేతిక వ్యవహారాల సలహాదారుడు శ్రీ కె.శంకరనారాయణన్ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు. వుక్కువుత్పత్తి, చమురు వుత్పత్తి, శుద్ధి, భారీయంత్రాల నిర్మాణంలాంటి పరిశ్రమల్లో భారతదేశం సాధించిన పురోగతికి చాలామేరకు సోవియట్ సాంకేతికపరిజ్ఞానం దోహదం చేసిందని ఆయనచెప్పారు. సోవియట్ సాంకేతిక పరిజ్ఞానాన్ని జపాన్, పశ్చిమజర్మనీ లాంటి



ఒ.పి.సచిదేవ్
టెక్స్‌టాన్ టెలికాన్ కంపెనీ
ఛైర్మన్, మేనేజింగ్ డైరక్టర్

అభివృద్ధి చెందినదేశాల్లో విస్తృతంగా వినియోగించుకుంటున్నప్పటికీ, మనదేశంలో అనేక ముఖ్యమైన రంగాల్లో అది తగినంత చేటు చేసుకోలేకపోయింది. భారతదేశానికి సంబంధించి యీ అసమానతకు కారణం భారతదేశం అనుసరిస్తున్న తలుపులు బార్లా తెరిచే విధానం కారణం కావచ్చు; కాగా సోవియట్ యూనియన్‌లోని సాంకేతిక నూతనరీతుల కల్పనలు, వుత్పాదకపరమైన అంకెలకు సంబంధించి తగినంత సమాచారం లభించక పోవడం చాలామేరకు కారణం. నియమనిబంధనలను బాగా విశదీకరించేట్టు చూడడంతోబాటు, సమాచారానికి సంబంధించిన ఒక సుస్థాపిత వ్యవస్థ అవసరాన్ని గురించి ఆయన నొక్కిచెప్పారు. యిది భారత, సోవియట్ యూనియన్‌ల వాణిజ్యనిర్వాహకుల సంయుక్త బాధ్యత అని ఆయన అన్నారు.



శ్రీమతి రీతాసింగ్
భారత -సోవియట్ వాణిజ్య మండలి ప్రధాన కార్యదర్శి

సోవియట్ యూనియన్‌కు ప్రయోజనకరమైనట్టి కొంత సాంకేతిక పరిజ్ఞానాన్ని భారతదేశంకూడా అందించగలదని ఆయన చెప్తూ, వున్నతస్థాయిలో వున్న సోవియట్ సాంకేతికపరిజ్ఞానాన్ని భారతదేశం వినియోగించుకోలేక పోతున్నందుకు ఆయన విచారం వెలిబుచ్చారు. పన్నులవిధింపు, ఆర్థికసూచీలు, కల్పించవోయే నదుపాయాలు, వగైరాలను గురించిన సమాచారాన్ని తెలిపే చిన్నపుస్తకాలను వెలువరించడంద్వారా యీ వెనుకబాటుతనాన్ని అధిగమించవచ్చని ఆయన అన్నారు. భారతదేశానికి అనుగుణమైన సోవియట్‌యూనియన్ లోని సాంకేతిక ప్రక్రియలను, ఉభయదేశాల

(మిగతా 62వ పేజీలో)

# సోషలిజంలో రాజకీయనాయకత్వం అధికారం కోసం పోరాటం

అనతొలి బుతెంకో, డి.ఎస్సీ (తత్వశాస్త్రం)
ప్రొ. మాస్కో విశ్వ విద్యాలయం

రాజకీయ నాయకత్వం అధికాగం కోసం పోరాటం సమస్యలు, బూర్జువా సమాజానికి ప్రత్యేకమైన యీ సమస్యలు సోషలిజంలో వుండవన్నది బాగా విస్తృతంగా వున్న పొరపాటు భావనల్లో ఒకటి.

అలాంటి అభిప్రాయం ఏర్పడటానికి అనేక కారణాలున్నాయి. 1. పెట్టుబడిదారీ వ్యవస్థ నుంచి కార్మిక వర్గం రాజకీయ ఆధిపత్యాన్ని (శ్రామిక వర్గ నియంతృత్వం) పొందిన కమ్యూనిజపు ప్రధమ దశ - సోషలిజం-లోకి పరివర్తన దశకు మాత్రమే రాజకీయ అధికార సమస్య వర్తిస్తుంది, అనే సాంప్రదాయక మార్క్సిస్టు భావనను

ఆధారం చేసుకోవడం అందుకు ప్రధమ కారణం. సోషలిజాన్ని నిర్మించడంతో వర్గాలు, గాజకీయాలు, రాజ్యాధికారం అంతర్ధానమైపోతాయని వాటి స్థానంలో రాజకీయేతర పౌర కమ్యూనిస్టు స్వయం ప్రభుత్వం నెలకొంటుందని భావించారు.

(2). పెట్టుబడిదారీ వ్యవస్థనుంచి సోషలిజంలోకి పరివర్తన దశలో సైతం, యావత్ కార్మిక వర్గం శ్రామిక ప్రజల తోడ్పాటుతో యీ అధికారం సాధించడం ప్రజలు నిర్వహించే ప్రజా ప్రభుత్వంగా వుండడం - యిదే ముఖ్య. సమస్యగా భావించారు.

(3). విప్లవోద్యమంలో నాయకుల పాత్రను పెద్దది చేసి చెప్పడాన్ని (వ్యక్తిపూజను) మార్క్స్ ఎంగెల్స్‌లు ఖండించారు. లెనిన్ అభిప్రాయమూ అదే. కమ్యూనిస్టు వుద్యమంలో "ప్రజలు - వర్గాలు నాయకులు" సమస్యను అధ్యయనం చేయడం అవసరమని లెనిన్ భావించారు. లెనిన్ మరణానంతరం నాయకత్వం అధికార వ్యవస్థ అనే అంశంపై సిద్ధాంతీకరించడాన్ని నిషేధించారు. ఎందుకంటే అప్పటికి రూపుదిద్దుకున్న మార్క్సిజం లెనినిజం సిద్ధాంతంలో నాటి ఆచరణ యిమడ లేదు

(4). పెట్టుబడిదారీ వ్యవస్థలో, సోషలి... లో రెంటిలోనూ వుండే ఒకే విధమయిన సమస్యలు రెండు వ్యవస్థల్లో భిన్న పద్ధతులలో పరిష్కారం అవుతాయి. పైన పేర్కొన్న సమస్య కూడా అలాటిదే అందువల్ల బూర్జువా సమాజంలో మాదిరిగా బయట పడే రూపంలో అది సోషలిజంలో వుండదు అనే అభిప్రాయాన్ని నొక్కి చెప్పడానికి యిది అవకాశమిచ్చింది.

అయితే దోపిడి వర్గాల రద్దు మొత్తంగా వర్గాల రద్దు - యీ రెండూ ఏక కాలంలోనే జరిగిపోవని అనుభవం రుజువు చేసింది. సోషలిజం ఒక వర్గ



సమాజంగానే వుంటుంది. రాజకీయ సంబంధాలు రాజ్యాధికారం వుంటాయి.

### కేవల మార్పుకాదు.

నాయకుల మార్పుతో అధికారం తరువాతి వారికి సంక్రమించే సమస్య, నాయకత్వం కోసం అధికారం కోసం పోరాటం - యివి కూడా పెట్టుబడిదారీ అనంతర సమాజంలో సంభవిస్తాయనీ కొత్త సమాజం వీటి నెదుర్కొనాలనీ తేలింది.

స్టాలిన్ ప్రభుత్వం నిలదొక్కుకోనడం అంటే లెనిన్ స్థానంలో మరో నాయకుడు స్టాలిన్ రావడం అని మాత్రమే అర్థమా? అధికారాన్ని నియంత్రిస్తున్న సామాజిక వర్గ శక్తుల పొందికలో కూడా గణనీయమైన మార్పు కాదా?

నికితా కృశ్చేవ్ ఆయన అనుయాయులు అధికారంలోకి రావడం, "వ్యక్తి పూజ దాని పర్యవసానాల"ను అధిగమించేందుకు పోరాటం అనేవి మరణించిన ఒక నాయకుని స్థానంలో మరో నాయకుడు రావడం మాత్రమే న కొన్ని సామాజిక రాజకీయ శక్తుల నుంచి యితర శక్తులకు అధికారం బదిలీ కావడం కాదా?

కృశ్చేవ్‌ను రాజకీయ నాయకత్వం పదవి నుంచి తొలగించడం "అరోగ్యకారణాల" వల్లేనా? ఆయన నాయకత్వం, విధానాలు కొన్ని రాజకీయ శక్తులకు సంతృప్తి కలిగించనందువల్ల జరిగిన మార్పు కాదా?

సోవియట్ రాజకీయ నాయకత్వంలో యిటీవల వచ్చిన మార్పుల్ని సైతం గోర్బచేవ్ వ్యక్తిగత గుణాలవల్ల వచ్చిన రాజకీయ మార్పుగా మాత్రమేకాక, సోవియట్ సమాజంలో ఏర్పడిన స్తబ్దతను అధిగమించాలని సోషలిజం సిద్ధాంతం ఆచరణను పునరుద్ధరించాలని పట్టుదలగా వున్న సామాజిక రాజకీయశక్తుల ప్రగాఢ సంకల్పం మార్పుల అవశ్యకత కూడా అందుకు కారణమని తప్పక భావించాలి.

నాయకుణ్ణీ, నాయకత్వాన్ని మార్చే సమస్యను బోల్షివిక్ పార్టీ తొలిసారి ఎదుర్కొంటున్న సమయంలో, అలాంటి మార్పుకి యంత్రాంగం లేని సమయంలో లెనిన్ మరణించారు. లెనిన్‌కు గల గొప్ప ప్రతిష్ఠ ఆయన నాయకత్వ పాత్రకు బలాన్నిచ్చింది. అధికార వ్యవస్థా స్వరూపాలలో అపరి పూర్ణతవల్ల ప్రమాదాలు ఏర్పడగలవని లెనిన్ ముందే వూహించారు. పార్టీ కేంద్ర కమిటీ అధికారాన్ని విస్తరింప చేయాలనీ సమిష్టి నాయకత్వ పద్ధతిని ధృఢతరం చేయాలనీ పరిపాలన యంత్రాంగంపై అజమాయిషీ వుండాలనీ ఆయన తన రచనల్లో కోరారు. స్టాలిన్‌ను ప్రధాన కార్యదర్శి పదవి నుంచి తప్పించే విషయం పార్టీ పరిశీలించాలని కోరారు.

### లెనిన్ మరణానంతరం

లెనిన్ మరణానంతరం యీ ప్రశ్న ముందుకొచ్చింది: ప్రధమ సోషలిస్టు దేశంలోని ఏకైక పార్టీ పాలక బోల్షివిక్ పార్టీ సోషలిజాన్ని నిర్మిస్తున్న శ్రామిక ప్రజల సమిష్టి నాయకునిగా తన పాత్రను నిలుపుకొనగలుగుతుందా? ప్రధాన పదవికి పోటీదార్లు స్టాలిన్, ట్రాట్‌స్కీలు. ఆ పోటీలో రాజ్య, పార్టీ అధికార పదవులకుగల పాత్ర, ప్రాధాన్యత మారిపోజొచ్చింది. జాతీయ నాయకత్వంలో పరస్పర వ్యక్తిగత సంబంధాల వాతావరణంలో మార్పు వచ్చింది.లెనినిస్టు స్ఫూర్తితో సోదర సహకారం పోయి అధికార పరిపాలన, బ్యూరాక్రటిక్ సంబంధాలు ఏర్పడ్డాయి. బ్యూరాక్రటైజేషన్ జరగకుండా నివారించేందుకు పార్టీ నుంచి రాజ్య పరిపాలనా యంత్రాంగాన్ని విడదీయాలన్న లెనిన్ భావనను సిబ్బందివట్ల స్టాలిన్ కొత్త విధానం వెనక్కు కొట్టింది. తనకు వ్యక్తిగతంగా విధేయులైన వారితో పార్టీ - రాజ్య ఏక యంత్రాంగాన్ని నెలకొల్పడం స్టాలిన్ వుద్దేశం.

లెనిన్ రాసిన లేఖ స్టాలిన్ పధకాలను వమ్ము చేసి వుండేది. మహాసభలో ఆలేఖను గురించి

చర్చ జరగకుండా స్టాలిన్ నిరోధించ గలిగారు. ఆ మహాసభ పొరపాటు చేసిందని నాఅభిప్రాయం. లెనిన్ సిఫార్సును అది వినలేదు. ప్రధాన కార్యదర్శి పదవిలో స్టాలిన్‌నే వుంచింది. తానెంపిక చేసిన సిబ్బందిపై ఆధారపడి పరిపాలక-బ్యూరాక్రటిక్ పిరమిడ్‌ను నెలకొల్పి స్టాలిన్ ఏక వ్యక్తి పాలనను స్థాపించుకోగలిగాడు. ప్రజలకు చివరకు కమ్యూనిస్టులకు సైతం మార్క్సిజం లెనినిజం నాల్గవ ప్రామాణిక గ్రంథంగా ఆయనే కనిపించడం మొదలైంది.

### బ్యూరాక్రసీ నీచ పాత్ర

రాజకీయ నాయకుడు సెర్గీ కిరోవ్ హత్యతో నాటి సోవియట్ రాజకీయ వ్యవస్థలో లెనినిస్టు వ్యతిరేక మలుపు పరాకాష్ఠ నందుకుంది. 1934లో యీ హత్య జరిగింది. 1937-38 సామూహిక అణచివేతలకు దీనిని సాకుగా వుపయోగించడం జరిగింది. స్టాలిన్ వ్యక్తిపూజ, పార్టీ, రాజ్య బ్యూరాక్రసీ దృఢతరమైనాయి.

చట్ట విరుద్ధ చర్యలకు బాధ్యత సోవియట్ రాజ్యానిదీ, కార్మిక వర్గానిదీనని కొందరు వాదించ యత్నిస్తున్నారు. దీన్నెంతమాత్రమూ అంగీకరించ వీల్లేదు. కార్మిక వర్గాన్ని పక్కకు తోసివేసి అధికారం హస్తగతం చేసుకున్న వారే ఆ ఘటనలకు బాధ్యత వహించాలి.

1956 లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టు పార్టి 20వ మహాసభ నిర్ణయాలు ఎవరిదో వ్యక్తిగత వ్యవహారంకాదు. పార్టీ ఎన్నో బాధలువడి సాధించుకున్న పంథా. సోవియట్ కమూనిస్టు పార్టీ 20వ మహాసభలో చేసిన నిర్ణయాలవల్ల రావలసిన మార్పుల్ని కోత బెట్టిందెవరు? ఎలా చేశారు? ఎందుకు చేశారు? అందుకు ఏ సామాజిక శక్తుల పై ఆధారపడ్డారు? మొదలైన విషయాలను గురించి సోవియట్ సామాజిక శాస్త్రవేత్తలు ముఖ్యంగా చారిత్రక వేత్తలు లోతైన అధ్యయనం చేయాల్సివుంది.

ఆజ్ఞల పరిపాలనా పద్ధతులను మార్చడంపై పెరిస్త్రోయికా కేంద్రీకరించడం కాకతాళీయమేమీ కాదు. గ్లాస్‌నోస్త్ ప్రజాస్వామ్యాల ద్వారా బ్యూరాక్రసీని చావుదెబ్బ తీయాలి. శ్రామిక ప్రజల స్వయంపాలనను అభివృద్ధిపర్చడం ద్వారా యీ విజయాన్ని సుదృఢపర్చుకోవాల్సి వుంది.

పాత ఘర్షణ విధానం స్థానే నూతన నిర్మాణాత్మక రాజకీయ ఆలోచనా ధోరణి నెలకొనాలంటే అది ప్రపంచస్థాయి స్వభావాన్ని సంతరించుకుంటేనే సాధ్యమవుతుంది. మండల స్థాయి మనస్తత్వాలతో దాన్ని ముక్కలు చేస్తే అది అపురూమయిన చైనా పింగాణీ కళా ఖండం నేలమీద బడ్డట్టు నాశనమైపోతుంది. అయితే అదే సమయంలో నూతన ఆలోచనా ధోరణి ఆసియాతో సహా యింకా స్పష్టంగా చెప్పాలంటే ఆసియా పసిఫిక్ మండలం (ఎ.పి.ఆర్)తో సహా ప్రపంచంలోని భిన్న మండలాల సమస్యల నిర్దిష్ట ప్రత్యేక స్వభావాలను దృష్టిలో వుంచుకొని తీరాలి. ఈ మండలంలోని పరిస్థితి అంతర్జాతీయ పరిణామాలను బలంగా ప్రభావితం చేస్తున్నందువల్ల యిది ప్రత్యేకించి ముఖ్యం.

### సానుకూల ప్రతిపాదనలు

సోవియట్ విదేశాంగ విధానంలో ఆసియా-పసిఫిక్ మండలానికి అధికతర ప్రాముఖ్యత నిస్తున్నట్టు సి.పి.ఎస్.యు. 27వ మహాసభ నొక్కి చెప్పింది. ఎ.పి.ఆర్. మండలంలో శాంతి భద్రతల పటిష్టతకు విస్తృతమయిన కార్యాచరణను గోర్బచేవ్ వ్లాదివోస్తోక్ ప్రసంగంలోను, మెర్డెకా పత్రికకు ఆయన యింటర్వ్యూలోను విశదీకరించడం జరిగింది.

అణ్వస్త్ర రహిత, హింసారహిత ప్రపంచ సూత్రాలగురించిన ఢిల్లీ ప్రకటన ఆసియా మండలంలోనే రూపుదిద్దుకోవడం అత్యంత హేతుబద్ధ విషయం. సోవియట్ అమెరికాల మధ్య ఐ.ఎన్.ఎఫ్. సంధిలో కూడా ఆసియాను గురించి అంశాలు వుండటం గమనార్హం. ఎ.పి.ఆర్. మండలాన్ని కూడా అణ్వస్త్ర ఉన్మాదం నుంచి విముక్తి చేసేందుకు వుద్దేశించిన సంధి యిది. యూరప్ తోబాటు యీ మండలంలో కూడా మధ్య శ్రేణి మిసిలీలను రద్దుపర్చే క్లాజును చేర్చాలని ఆసియా దేశాల ప్రయోజనాలను ప్రధానంగా దృష్టిలో వుంచుకునే సోవియట్ ప్రతిపాదించింది. పాశ్చాత్య దేశాల మాదిరి కాకుండా సోవియట్ యూనియన్ రారోటాంగా సంధిపై సంతకాలు చేసింది. దక్షిణ పసిఫిక్ దేశాలు తమ ప్రాంతాన్ని అణ్వస్త్ర విముక్తి మండలంగా ఆ సంధిలో ప్రకటించుకున్నాయి.

ప్రాంతీయ ఘర్షణలకు పరిష్కారం విషయంలో సోవియట్ సూత్రబద్ధవైఖరి తీసుకుంది. ఆఫ్ఘని

# విదేశాంగ విధాన సమస్యలు

## ఆసియా
## పసిఫిక్ మండలం



# నూతన ఆలోచనా ధోరణీ ఆసియా

డి.వోల్‌స్కీ

స్తాన్ సమస్య. విషయమై గోర్బచేవ్ ప్రకటన ప్రపంచమంతటినీ ఆకట్టుకుంది. ఆఫ్ఘనిస్తాన్‌లో శాంతిని స్థాపించేందుకు వాస్తవిక పంథాను అది చూపింది. కంపూచియా నాయకత్వం రూపొందించిన జాతీయ సామరస్యతా కార్యక్రమానికి సోవియట్ సర్వతోముఖ తోడ్పాటును ప్రకటించింది. కొరియా ద్వీపకల్పంలో సాధారణ పరిస్థితి నెలకొల్పేందుకు కొరియా పీపుల్స్ డెమాక్రాటిక్ రిపబ్లిక్ చేసిన శాంతి చొరవలకు సోవియట్ తోడ్పాటు నిస్తోంది. ఇరాన్, ఇరాక్‌ల మధ్య యుద్ధాన్ని అంతమొందించి, ఐరాస భద్రతా సంఘం తీర్మానం ప్రాతిపదికగా సింధుశాఖ సమస్యలకు రాజకీయ పరిష్కారాన్ని సాధించే కృషిని సోవియట్ ఏకరీతిగా బలపరుస్తున్నది. తీర్మానాన్ని త్రికరణశుద్ధిగా అమలు పర్చాలని కోరుతున్నది.

ఆసియాలోను, యీ ప్రాంతపు మహా సముద్రాలలోను సైనిక తలపాట్లను ముఖ్యంగా అణ్వాస్త్ర ముప్పును తొలగించేందుకు వుద్దేశించిన సోవియట్ పంథా ప్రపంచంలో ఘర్షణ పరిస్థితులు తొలగించేందుకు వుద్దేశించిన సోవియట్ విధానానికి పూర్తి అనుగుణమైంది. స్వయంగా సోవియట్ యూనియన్ ప్రతిపాదనలు చేయడం, స్థానిక రాజకీయ వర్గాల నిర్మాణాత్మక ప్రతిపాదనలను బలపర్చడం యివి రెండూ యీపంథాలో భాగం. తాజా ప్రతిపాదనలు బలంగా నిలదొక్కుకున్నాయంటే ప్రపంచంలో ముఖ్యంగా ఆసియాలో వేగంగా మార్పులు రావడమే కారణం.

### పెద్ద మార్పులు

గత కొద్ది సంవత్సరాలలో ఆసియాలో మార్పుల్ని విశ్లేషిస్తే అంతర్ బాంధవ్యం గల అంశాలు ద్యోతకం అవుతాయి. వాటి దృష్ట్యా నూతన ఆలోచనా ధోరణి అవసరం. సోవియట్ వాటిని ఆధారం చేసుకునే ఆసియాపట్ల తన వైఖరిని రూపొందించుకుంటోంది. ఆసియా ఆర్థిక శక్తి

ముఖ్యంగా పసిఫిక్ మండలంలో పెరగడం, ప్రపంచ ఉత్పత్తిలో దాని వాటా పెరుగుదల, రోబట్‌లు, కంప్యూటర్‌లు, మైక్రో ప్రాసెసర్లువంటి వున్నత సాంకేతిజ్ఞతగల వస్తువుల ఉత్పత్తి పెరుగుదల యివన్నీ ఆ అంశాలు. పసిఫిక్ యుగం ఆరంభమైపోయిందని పలువురు పాశ్చాత్య విశ్లేషకులు భావించడానికి యిది దారి తీసింది.

**ఈ సహస్రాబ్దాంతం మలుపులో**

అమెరికా, జపాన్‌లు "పసిఫిక్ కుటుంబం" అనే బోర్డు కింద సంకుచిత ముఠాను కట్టేందుకు అనేక సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నాయి. సోవియట్ అలా కాకుండా పసిఫిక్ తీరంలోని అన్ని దేశాల సహకారానికి క్రమబద్ధ కార్యక్రమాన్ని సూచిస్తున్నది. ఇతర పసిఫిక్ దేశాలతోబాటు అమెరికాకు కూడా యిది చెందుతుంది. అమెరికాకు ఆ మండలంలోని దేశాలతో దీర్ఘకాల అర్థిక సంబంధాలున్నాయి. సాంప్రదాయక ఆర్థిక సంబంధాలు భగ్నం కాకూడదనే సోవియట్ అభిప్రాయం. అయితే నయా వలసవాద ప్రయోజనాల కోసం ఆ సంబంధాలను ఎవరైనా దుర్వినియోగపర్చదలిస్తే సోవియట్ అంతగానూ వ్యతిరేకిస్తూంది.

ఏదేశ ప్రయోజనాలకూ భంగం కలగని రీతిలో సమానస్థాయీ, పరస్పర లాభదాయక సహకారం వుండాలని సోవియట్ భావనాసారం. భారత దేశంతో సోవియట్ మైత్రీ సంబంధాలు యిలాటి సహకారానికి స్పష్టమైన దృష్టాంతం. ఈ సంబంధాలు మిగతా ప్రపంచానికి ఆదర్శంగా వుండగలవని శ్రీ రాజీవ్‌గాంధీ అన్నారు. పెట్టుబడీదారీ ప్రపంచపు స్టాక్ మార్కెట్‌లలో యిటీవలి ఘటనల దృష్ట్యా సోవియట్ భారత సహకారంలోని యీ అంశాలు మరింత ప్రధాన్యత సంతరించు కున్నారు.

ప్రపంచ ఆర్థిక మాంధ్యాల ప్రభావం భారత ఆర్థిక వ్యవస్థపై ఏ మంతపడలేదంటే అందుకు ముఖ్యకారణం సోవియట్ యూనియన్‌తో భారత దేశం సంబంధాలు సహకారమే అని టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక పేర్కొంది.

సోవియట్ విదేశాంగ విధానం దాని దేశీయాంగ విధానం పరస్పరం ముడివడి వున్నాయి. మరింత ప్రజాస్వామ్యం, మరింత బాహాటత - యివే ఆసియా - పసిఫిక్ మండలం విషయంలో సోవియట్ దౌత్య కార్యకలాపాలను నిర్ధారిస్తున్నాయి. పునర్వ్యవస్థీకరణ కృషివల్ల అర్థిక వ్యవస్థ జీవద్వంతం కావడం విదేశీ భాగస్వాములలో మరింత విశ్వాసాన్ని కలిగిస్తున్నది. పెరిస్త్రోయికా వల్ల విదేశాలతో సహకారానికి కొత్త అవకాశాలు ఏర్పడ్డాయి.

నూతన ఆలోచనా ధోరణిలో ఆర్థిక, రాజకీయ జాతి లేదా మతపరమైన వివక్షలు ఏవీ వుండవు.

భిన్న రాజకీయ శక్తులకు గల సానుకూల శక్తిస్తోమతలను వ్యక్తపరచుకోడానికి యిది అవకాశమిస్తుంది. పైన పేర్కొన్న ఢిల్లీ ప్రకటన భిన్న భావజాలాలకు చెందిన విలువల మేలు కలయిక.శాంతియుత సహజీవనం అనే మార్క్సిస్టు లెనినిస్టు భావన అహింస అనే గాంధీ సూత్రం యిందులో వున్నాయి. అందువల్లనే అది సార్వజనీన ప్రాముఖ్యతగల ప్రకటన అయింది.

ఆసియాలో భిన్న సామాజిక వ్యవస్థలు, భిన్న సాంస్కృతిక, రాజకీయ, మత సాంప్రదాయాలున్నాయి. అందువల్ల యిది ఆసియాకు ప్రత్యేకించి ముఖ్యమైంది. అంతేకాదు. పెద్ద రాజ్యాలు మాత్రమే కాక స్థానిక శక్తులు కూడా రాజకీయ సమస్యలపట్ల బాధ్యతాయుత వైఖరులు చేపట్టడం అవసరం. ఆదర్శాల కోసం ప్రాచీనకాలం వేపు చూసే శక్తులు కూడా అలాటి వైఖరులు చేపట్టాలి. ఇరాన్, ఇరాక్ యుద్ధంతో సహా ప్రాంతీయ ఘర్షణలు పరిష్కారం కావాలంటే యీ శక్తులు అందుకు నిర్మాణాత్మక దోహదం చేసి తీరాలి.

ఘర్షణ వైఖరుల కన్నా హేతుబద్ధ రాజీలు సురక్షితమైనవి. అందువల్లనే నూతన ఆలోచనా ధోరణి ప్రాతిపదికగా చేసిన సానుకూల ప్రతిపాదనలకు ఆసియా పసిఫిక్ దేశాల ప్రజలలో రాజకీయ వర్గాలలో ప్రాచుర్యం నానాటికీ మరింత పెరుగుతోంది.

సమగ్ర అంతర్జాతీయ భద్రతా వ్యవస్థ స్థాపన కోసం ప్రపంచ వ్యాపిత కృషిలో చేరే అవకాశం యీ సువిశాల మండలం ముందున్నది. తమతమ దేశాల ప్రయోజనం కోసం మానవాళి మేలు కోసం అత్యంత భిన్నమైన దేశాలు ప్రజలు పరస్పర సహకారం నెరపుకొంటున్న భవిష్యత్ ఆసియా దృశ్యం నిష్పక్షపాతంగా చూడగలిగిన వారికి కనిపిస్తుంది.

(ఆసియా అండ్ ఆఫ్రికా టుడే పత్రిక నుంచి)

# ఆసియాపసిఫిక్ మండలంలో యుద్ధప్రమాదాన్ని తగ్గించి భద్రతను పటిష్టీకరించే కార్యక్రమం

ఆసియాపసిఫిక్ మండలంలో భద్రతను పటిష్టమొనరించి, యుద్ధప్రమాదాన్ని తగ్గించడానికి సంబంధించిన కింది కార్యక్రమం సోవియట్-అమెరికన్ పండితుల సంయుక్త కృషి ఫలితం. 1986, 1987లలో మాస్కోలో, స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో జరిగిన సమావేశాల్లోను, వర్కింగ్ గ్రూప్ సమావేశాల్లోనూ ఈ కార్యక్రమాన్ని రూపొందించాలనే యోచన కలిగింది. సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీకి చెందిన దూర ప్రాచ్య అధ్యయనాల ఇన్‌స్టిట్యూట్, స్టాన్‌ఫర్డ్‌లోని అంతర్జాతీయ వ్యూహాత్మక వ్యవహారాల ఇన్‌స్టిట్యూట్‌ల ఆధ్వర్యంలో జరిగిన ఈ సమావేశాలు ఆసియా పసిఫిక్ మండలంలో శాంతి, సహకారాలకై నూతన పథాలను అన్వేషించడానికి ఉద్దేశించినవి. ఈకార్యక్రమం అమెరికా సోవియట్ సంబంధాల్లో ప్రత్యేకించి ముఖ్యమైన సమయంలో వెలువడుతోంది. ఇది ఆసంబంధాల్లో వచ్చిన అనేక సానుకూల పరిణామాలను ప్రాతిపదికగా చేసుకుందని మేము నమ్ముతున్నాము.

దీనిలోని అంశాలను సోవియట్ యూనియన్ అమెరికాలలోని పండితుల, విధాన నిర్ణేతల దృష్టికి మాత్రమేగాక యితర దేశాల్లోని వారి దృష్టికి ప్రత్యేకించి ఆసియా - పసిఫిక్ మండలంలోని వారి దృష్టికి కూడా తీసుకురావడం, ఈకార్యక్రమాన్ని ప్రవేశపెట్టడంలోని మాఉద్దేశం, ఈ పత్రంలోని భావనలను, ప్రతిపాదనలను మెరుగుపర్చడానికి ప్రయత్నించడంలో, దాని లక్ష్యాలను సాధించడానికి కృషి సల్పడంలో మాతో కలవవలసిందిగా ఈ కార్యక్రమ పాఠకులను మేము ఆహ్వానిస్తున్నాం.


మిహయిల్ తితరెంకొ
డైరెక్టర్
సోవియట్ యూనియన్
విజ్ఞానశాస్త్రాల అకాడమీ
తాలూకు దూర ప్రాచ్య
అధ్యయనాల ఇన్‌స్టిట్యూట్

జాన్ డబ్ల్యు. లూయిస్
అధ్యక్షుడు
స్టాన్‌ఫర్డ్‌లోని అంతర్జాతీయ
వ్యూహాత్మక వ్యవహారాల
ఇనిస్టిట్యూట్,
స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం.


స్టాన్‌ఫర్డ్, కాలిఫోర్నియా,
అక్టోబరు 2, 1987.

# ఆసియా - పసిఫిక్ మండలంలో యుద్ధ ప్రమాదాన్ని తగ్గించి, భద్రతను పటిష్టీకరించే కార్యక్రమం.

### కార్యక్రమ నిర్దిష్ట లక్ష్యాలు

ఆసియాపసిఫిక్ మండలంలో విశ్వాస సంవర్ధక చర్యల పై చర్చకు ఆచరణాత్మక పునాదిని సమకూర్చడం.

### కార్యక్రమసాధారణ లక్ష్యాలు

ప్రస్తుతమున్న సమస్యలపై ఉమ్మడి అవగాహన కోసం, ఆసియా —పసిఫిక్ మండల దేశాల మధ్య సంభాషణలను ప్రోత్సాహించడం.

ఆసియా-పసిఫిక్ మండల దేశాల మధ్య సమానత్వ ప్రాతిపదికపై పరస్పర ప్రయోజన కరమైన సహకారాన్ని పెంపొందించడం.

ఆసియా - పసిఫిక్ మండలంలో విశ్వాసాన్నీ భద్రతనూ పటిష్టీకరించడం.

ఆసియా-పసిఫిక్ మండలంలో సైనికతల పాటు ప్రమాదాన్ని తగ్గించడం.

ప్రపంచ ప్రాముఖ్యతగల ఒప్పందాల ప్రాతిపదిక పై అణ్వాయుధ తలపాటు ప్రమాదాన్ని తగ్గించ డానికీ, అంతర్జాతీయ భద్రతనూ ఆసియా - పసిఫిక్ మండలంలోయితరత్రా సుస్థిరతనూ పటిష్టీకరించడానికి దోహదం చేయడం.

### విశ్వాస సంవర్ధక చర్యలు

విశ్వాస సంవర్ధకచర్యలు సాయుధ ఘర్షణ సంభావ్యతను తగ్గించి, దాడి శక్తుల సమతూకపు తగ్గింపునకు దారి తీయాలి; ముఖ్యంగా తీవ్ర సైనిక తలపాటుగల మండలాల్లో యిది జరగాలి. విశ్వాస సంవర్ధక చర్యల కార్యక్రమం సూత్రరీత్యా సమగ్రమైనదిగా ఉండగలదు; సైనిక కార్యకలాపాలపై ప్రత్యక్ష ప్రభావంగల నిర్దిష్టచర్యలకు విస్తృత రాజకీయ, చట్టపరమైన చట్రం ఈ కార్యక్రమంలో భాగంగా ఉండగలదు. అయితే, విశ్వాస సంవర్ధక చర్యలు సైనికంగా ప్రాముఖ్యత గల కొన్ని నిర్దిష్ట సమస్యల పైన మాత్రమే దృష్టిని కేంద్రీకరిస్తు న్నప్పటికీ, ఈ చర్యలు ఉపయోగకరమైనవే విశ్వాస సంవర్ధక చర్యల కార్యక్రమం అనేది తీవ్ర భద్రతా ప్రయోజనాలను తీర్చడమే గాక ఈ కార్య క్రమంలో పాల్గొంటున్న దేశాలు నగ్నంగా పరస్పరం మొహరించే స్థితినుండీ మరింత సహకార యుతమైన సంబంధానికి మారడమన్న ప్రగాఢ రాజకీయ ప్రయోజనాన్ని కూడా తీర్చాలి ఆవిధంగా సంభాషణల, పరస్పరసర్దుబాట్ల క్రమం ప్రారంభమవుతుంది. — ద్వైపాక్షిక సంబంధాలకు మరింత శక్తిని ప్రసాదించే, ఉత్తరోత్తరా విస్తృత ప్రాతిపదికపై సానుకూల రాజకీయ, ఆర్థిక, భద్రతా సంబంధాలు నెలకొనే పరిణామానికి దారి తీసే క్రమమిదే. సుస్థిరతను పటిష్టీకరించి ఆసియా -పసిఫిక్ మండలంలో యుద్ధ ప్రమాదాన్ని తగ్గించే కార్యక్రమానికి నప్పే విశ్వాస సంవర్ధక చర్యల్లో, ద్వైపాక్షిక, బహుపక్ష సంప్రతింపుల ఫలితంగా ప్రపంచ స్థాయిలోనూ, లేదా ద్విపక్ష బహుపక్ష సంప్రతింపుల ఫలితంగా ప్రాంతీయ స్థాయిలోనూ ఆచరణ రూపం ధరించే చర్యల వంటివి ఉండవచ్చు సోవియట్ యూనియన్, అమెరికాల మధ్య కుదిరిన సాల్ట్ మొదలగు ఒప్పందాలు మొదటి రకానికి ఉదాహరణలు కాగా, యూరప్ భద్రతా సహకార సమావేశ భాగస్వాములు ఆమోదించిన స్టాక్ హోంపత్రం వంటివి రెండవ రకానికి ఉదాహరణలు.

అణుయుద్ధ ప్రమాదం తగ్గింపు కేంద్రాలను మాస్కో, వాషింగ్టన్‌లలో స్థాపించడానికి అమెరికా, సోవియట్ యూనియన్‌లు ఒప్పందం కుదుర్చు కున్నాయి. దీన్ని ఆధారంగా చేసుకొని రెండు దేశాలు వ్యూహాత్మక అణ్వస్త్ర కార్యక్రమాలకు వర్తించే విశ్వాస సంవర్ధక చర్యలకై ప్రతిపాదనలు చేశాయి. భావి అమెరికా - సోవియట్ సంప్రతింపు లలో వ్యూహాత్మక అణ్వాయుధాల విషయమై ప్రపంచవ్యాప్త స్థాయిలో అటువంటి చర్యలను తీసుకోవడం సాధ్యమే. అవి ఆసియా పసిఫిక్ మండలంలోను, ఇతరత్రా కూడా వర్తిస్తాయి. అవి ఆ మండలంలో శాంతి, సుస్థిరత, భద్రతలకు అవకాశాలను మెరుగు పర్చగలవు. ఆసియా - పసిఫిక్ మండలంలోని సైనిక తలపాటు ప్రాంతాలకు వర్తించగల విశ్వాస సంవర్ధక చర్యల సంగతికి వస్తే, స్టాక్ హోం పత్రం వీటికి మార్గ దర్శకంగా పరిగణించవచ్చు. స్టాక్‌హోం పత్రం సూచించిన చర్యలు సంగ్రహంగా ఇవి :

— సైనిక విన్యాసాది కార్యకలాపాలను తన భూభాగంపై తలపెట్టిన రాజ్యం, అవి ప్రారంభం కావడానికి 42 రోజులు ముందుగానైనా, లేక అంతకన్నా ముందుగానైనా ఒప్పందంలోని ఇతర

భాగస్వామ్య రాజ్యాలకు రాతమూలకంగా తెలియ చేయటం.

— యీ సైనిక కార్యకలాపాలను తిలకించ డానికి ఇతర భాగస్వామ్యరాజ్యాల పరిశీలకులకు దౌత్యమార్గాల ద్వారా ఆహ్వానం పంపడం.

—మరునటి సంవత్సరానికి తలపెట్టిన సైనిక కార్యకలాపాలను గురించి ప్రతి సంవత్సరం నవంబర్ 15 లోగా దౌత్యమార్గాలద్వారా రాత మూలకంగా ఒప్పందంలోని ఇతర భాగస్వామ్యరాజ్యాలకు తెలియజేయడం.

— ఆ తర్వాతి సంవత్సరానికి 40,000 లకు పైగా సైనికులతో తలపెట్టిన సైనిక కార్యకలాపాలను గురించి కూడా ప్రతి సంవత్సరం నవంబర్15 లోగా తెలియజేయడం.

— ప్రతి భాగస్వామ్యరాజ్యానికి ఇటువంటి కార్యకలాపాలు సాగే ఏ ఇతర భాగస్వామ్య రాజ్య భూభాగాన్నైనా తనిఖీ చేసే హక్కుంటుంది.

వివిధ దేశాలు ఇది వరకే ద్వైపాక్షిక, లేదా బహుపక్ష సమావేశంలో అంగీకరించిన విశ్వాస సంవర్ధక చర్యలకు తోడు, అదనపు చర్యలను ప్రతిపాదించాయి. ఆసియా - పసిఫిక్ మండలంలో విశ్వాససంవర్ధక చర్యల కార్యక్రమం, వాటి పట్ల ఆసక్తిగల రాజ్యాల అవసరాలకు అనుగుణంగా ఉండాలి కాబట్టి ఈ అదనపు చర్యలను పరిశీలించ వలసి ఉంటుంది. అణ్వాస్త్రాల వ్యాప్తిని నిరోధించ డానికి తోడ్పడే విశ్వాస సంవర్ధక చర్యలు ఈ తరగతికి చెందినవే.

## సంప్రతింపుల లక్ష్యం

ఆసియా — పసిఫిక్ మండలంలో ప్రస్తుత విశ్వాససంవర్ధక చర్యలను అమలు జరపటం, ఆయా రాజ్యాల బాధ్యతేనని అవి గుర్తించడం ముఖ్యం. యూరప్ భద్రతా సహకార సమావేశం ఒక శాశ్వత బహు పక్ష సంస్థను, లేదా పర్యవేక్షక సంస్థను స్థాపించలేదు. ద్విపక్ష, లేదా ఉపమండల స్థాయిలో విశ్వాస సంవర్ధక చర్యలను అమలు పర్చటమొక్కటే అక్కడ అనుసరించిన మార్గం. ఆసియా — పసిఫిక్ మండలంలో ద్విపక్ష, ప్రాంతీయ స్థాయి సంబంధాలు మరింత బాగా అభివృద్ధి అయ్యాయి. కాబట్టి, యీ స్థాయిల్లో సంప్రతింపులు జరపడం విశ్వాస సంవర్ధక చర్యలను అమలు పర్చటం ఈ మండలంలో మరింత సులభం.

యూరప్‌లో లాగా ఆసియా - పసిఫిక్ మండలంలో ఈ సంప్రతింపులు మండల, బహుపక్ష సమావేశం జరపడంపై ఆధారపడనవసరం లేదు. ఇక్కడ వేరే పద్ధతి అవలంబించవచ్చు. విశ్వాస సంవర్ధక చర్యలు తక్షణమే అవసరమైన నిర్దిష్టప్రాంతాలు ఉన్నాయి. ఇవి ఒకదాని కొకటిదూరంగా ఉన్నాయి. ఉత్తర ఆసియా, కొరియా ద్వీపకల్పం, ఆగ్నేయాసియా, దక్షిణాసియా మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. ఈ ప్రాంతాల్లోని రాజ్యాలు ఇతర ప్రాంతాలతో నిమిత్తం లేకుండా తమలో తాము వెంటనే చర్చలు ప్రారంభచవచ్చు. వీటి నిర్ణయాలు వీటికే వర్తించాలే తప్ప ఇతర రాజ్యాలపై అవి ఎటువంటి బాధ్యతలూ మోప రాదు.

ఆసియా - పసిఫిక్ మండలంలో విశ్వాస సంవర్ధక చర్యలను అమలు పర్చడం యుద్ధ ప్రమాదం తగ్గుదలకు ఫలప్రదమైన మార్గం. కాబట్టి, వాటి వస్తుగత అవసరముంది. అయితే, చర్చలు ప్రారంభించడానికి ఈ మండలంలోని రాజ్యాలకు రాజకీయ ప్రేరణకూడా ఉండాలి. ఏవో ఒకటి, రెండు రాజ్యాలు. చొరవ తీసుకోవడం చాలదు. ఎందువల్లనంటే, తమపై పెత్తనానికి ప్రయత్నాలు జరుగుతున్నాయన్న అనుమానాలు గట్టిగా పాదుకొని ఉన్న మండలమిది.

ఆసియా - పసిఫిక్ భద్రతపై సంబంధిత ఐ.రా.స సంస్థల్లో ప్రత్యేకంగా చర్చించటం ఇటువంటి రాజకీయ ప్రేరణకు దోహదం చేయగలదు. సోవియట్, అమెరికా తదితర దేశాల్లో విద్యత్ సంస్థల ప్రవీణుల సమిష్టి కృషి కూడా ఆసియా -పసిఫిక్ మండలంలో విశ్వాస సంవర్ధక చర్యలపై సంప్రతింపులకు రాజకీయ ప్రేరణ కలిగించ గలదు. ఈ మండలంలోని అన్ని దేశాల మధ్య సహకార సంబంధాలు అభివృద్ధి చెందితే, ఆయుధాల పరిమితిపై వీటి మధ్య ఒప్పందాలు కుదిరితే ఈ పత్రంలో వివరించిన విశ్వాస సంవర్ధన చర్యలు మరింత ఫలితమిస్తాయి.

(కార్యక్రమ సంక్షిప్త పాఠం)

# విదేశాంగ విధాన సమస్యలు

## ప్రపంచంలోని ఉద్రిక్తతా ఆలవాలాలు

# యుద్ధరంగాల

— ద్మీత్రి జెర్‌స్కీ, పాత్రికేయుడు

ఇరాన్ - ఇరాక్ ఘర్షణను విస్మృతయుద్ధంగా కొన్నేళ్ళక్రితం వార్తాపత్రికలు వ్యాఖ్యానించాయి. అప్పుడు ఆ దేశాలు షత్‌అల్ ఆరబ్ నదీతీరప్రాంతా నగల భూభాగం విషయంలో తగాదాపడి పోరాటం సాగిస్తూండేవి ప్రస్తుతం యుద్ధకార్యకలాపాలు పర్షియా సింధుశాఖకు వ్యాపించాయి కాబట్టి, ఆ ప్రాంతంలోని ఘటనలను గురించి క్రమం తప్పకుండా వార్తలు వెలువడుతున్నాయి; ప్రపంచంలోనే ఆ ప్రాంతం అత్యంత వుద్రిక్తభరితమైనదిగా మారింది. యిందుకు కారణం చమురు. యిందువల్లే అమెరికా నౌకాదళాలూ, అమెరికాతో బాంధవ్యంగల పాశ్చాత్యదేశాలూ యీ ఘర్షణలో తలదూర్చాయి. ప్రపంచ పత్రికలు యీ ప్రాంతంమీద దృష్టికేంద్రీకరించడానికి మూలం చమురే.

### చమురు వ్యాపారంలో వైపరీత్యాలు

వ్యాపారరంగంలోని పరిస్థితిని అంచనా వేయడంకన్నా యుద్ధరంగంలోని పరిస్థితిని అంచనా వేయడం మరింత సులభం కాబట్టి, మనకు చాలావిపరీతమైన దృశ్యం కనిపిస్తుంది : పర్షియా సింధుశాఖలో యుద్ధం జరుగుతోంది. యిది ఇరాన్ - ఇరాక్ యుద్ధభూమిలో యెన్నడూ లేనంత తీవ్రస్థాయికి చేరుకుంది. యీ యుద్ధంతో ప్రమేయంలేని రాజ్యాలు దీనికి బలి అవుతున్నా వ్యాపారం మాత్రం మామూలుగానే సాగుతోంది. పర్షియా సింధుశాఖలోని పరిస్థితిని పట్టించుకోకుండా వ్యాపారాన్ని మాత్రం దృష్టిలోకి తీసుకుంటే, అసలు యుద్ధమే జరగడంలేదనిపిస్తుంది. బహుశ యిదే, ప్రధానమైన వైపరీత్యం. దీన్నీ అలాగే చమురు మార్కెట్‌లో వచ్చే మార్పునూ అర్థంచేసుకోడానికి యిటీవలి ఘటనలను పరి శీలించడం అవసరం.

1973 ప్రారంభంలో ఒక బ్యారెల్ (159 లీటర్ల యింధనానికి సమానం) 3.4 డాలర్లకు అమ్ముడుపోయేది. ఆ యేడాది చివరి మూడునెలల్లో అరబ్-ఇజ్రాయిలీ యుద్ధం నాలుగోసారి మొదలై, ముగిసింది. ఇజ్రాయిల్ జరిపిన దురాక్రమణ యుద్ధాలకు బలిఅయిన దేశాలపట్ల సంఘీభావం కనిబరస్తూ ఇజ్రాయెల్‌ను సమర్థించిన దేశాలకు ముఖ్యంగా అమెరికాకు ఒపెక్ యింధన సరఫరాలను నిషేధించాల్సిందిగా పర్షియా సింధుశాఖలోని, చమురు వుత్పత్తిచేసే అరబ్‌దేశాలు ప్రతిపాదించాయి యింధనం కొరతలు చమురు ధరలపై వెంటనే ప్రభావం నెరపాయి మూడు

ప్రపంచంలోని అత్యంత విస్ఫోటక ప్రాంతమైన పర్షియా సింధుశాఖ మండలం - ఇరాన్, ఇరాక్ మండలం- గురించి యీ వ్యాసం వివరిస్తున్నప్పటికీ, అక్కడి శత్రుత్వాలను ఘర్షణకు, యుద్ధరంగాల వెనుకతట్టు పరిస్థితికి అంతముఖ్యమైన కారణాలుగా పరిగణించ డంలేదు.

# వెనుక తట్టున

1987 చివరి నాటికి పర్షియన్ సింధు శాఖలో గల యుద్ధ నౌకల సంఖ్యను తెలియజేస్తున్న పటం.



నెలల్లోనే ధరలు 4 రెట్లు పెరిగి, 1982 లో బ్యారెల్ చమురు ధర 34 డాలర్లకు చేరుకుంది. క్రూడా యిల్ యెగుమతి ద్వారా వచ్చే ఆదాయాలు పర్షియా సింధుశాఖలోని కొన్ని అరబ్‌దేశాల్లో సెకెండుకు 100,000 డాలర్లకు చేరుకున్నాయి.

ఇంధనం కొరత మూలంగా పశ్చిమయూరప్, జపాన్, అమెరికాలలో ప్రత్యామ్నాయ శక్తి మూలాధారాలకోసం తీవ్రమైన అన్వేషణ జరపాల్సి వచ్చింది. సౌరశక్తి బ్యాటరీల విడిభాగాలు జపాన్‌లో క్షణాలమీద అమ్ముడుపోసాగాయి. గాలి సహాయంతో నడిచే విద్యుత్ జనరేటర్లతో కూడిన పెద్ద యంత్రవ్యవస్థలను అమెరికాలో ప్రవేశపెట్టారు. అణువిద్యుచ్ఛక్తిపట్ల, జలవిద్యుచ్ఛక్తిపట్ల కూడా ఆసక్తి పెరిగింది. ఒపేక్‌కు చెందని దేశాలు తమ చమురుక్షేత్రాలను ముమ్మరంగా అభివృద్ధిచేయడం ప్రారంభించాయి.

1986 లో ఒకబ్యారల్ చమురు ధర 9 డాలర్ల కన్నా తక్కువకు పడిపోయింది. ధరలో యీ మాంద్యం చమురు యెగుమతి సంస్థకు హెచ్చరికలాంటిది. 1986 డిసెంబర్‌లో ఒపెక్ దేశాలు రోజువారీ వుత్పత్తి కోటాను 15.8 మిలియన్ల బ్యారెళ్ళకు తగ్గించడానికీ, యీ సంస్థలోని సభ్యదేశాలన్నీ బ్యారెల్ చమురును 18డాలర్ల కొత్త ధర చొప్పున మాత్రమే అమ్మడానికీ అంగీకరించాయి.

1973 లో అరబ్‌రాజ్యాలకూ, ఇజ్రాయెల్‌కూ మధ్య యుద్ధం ప్రారంభమైనప్పుడు అరబ్ రాజ్యాలు వెంటనే తమ భేదాభిప్రాయాలను మరిచి సంఘటితమయ్యాయి. దురాక్రమణదారుణ్ణి తిప్పికొట్టేందుకు అవన్నీ ఈజిప్టుపక్షం వహించాయి. అప్పుడవి లాభాలకోసంగాక, మరింత వుదాత్తభావాలకోసం నిషేధంవిధించి చమురు ధరను పెంచాల్సివచ్చింది.

కానీ యిప్పటి పరిస్థితి వేరుగా వుంది. యిప్పుడు యుద్ధం రెండు ముస్లిం రాజ్యాల మధ్య జరుగుతోంది. మునుపటి ఐకమత్యం స్థానంలో యిప్పుడు వ్యాపారపరమైన ఆలోచనలూ, సంకుచిత జాతీయ ప్రయోజనాలూ చోటుచేసుకున్నాయి. రోజుకు 15.8 మిలియన్ల బ్యారెళ్ళు వుత్పత్తి చేయాలనే అంగీకారాన్ని ఒపెక్ దేశాలు వుల్లఘించాయి. గత ఆగస్టులో యిది 19.7 మిలియన్ బ్యారెళ్ళకు చేరుకుంది. త్వరగా లాభాలు పొందేందుకై ఇరాన్ తరచుగా చమురు ధరను తగ్గించి అమ్మసాగింది.; అదే సమయంలో నిర్ణీతకోటాకన్నా చాలా యెక్కువ వుత్పత్తి చేయసాగింది.

ఇరాన్‌కు నిర్ణయించిన చమురువుత్పత్తి కోటా కన్నా తన వుత్పత్తి కోటాను తగ్గిస్తే ఒప్పుకోనని ఇరాక్ చెప్తోంది. ఒపెక్ కుదుర్చుకున్న ఒప్పందాలను యుద్ధమగ్నమైన దేశాలు ఖాతరు చేయడంలేదు కాబట్టి తక్షణ ద్రవ్య, ఆర్థిక సమస్యలను యెదుర్కొంటున్న యితర సభ్యదేశాలు వాటిని పాటించకపోవచ్చు . వీటన్నిటి మూలంగా మార్కెట్‌లో చమురునిల్వలు అధికమయ్యాయి. దీంతో పాశ్చాత్య దేశాలు తమకు యిష్టమొచ్చినధరలను చమురు వుత్పత్తి చేసే దేశాలకు నిర్దేశించే అవకాశం యేర్పడింది.

## అమెరికా విధానం

చమురు విషయంలో ప్రపంచంలోనే అమెరికా ప్రధాన వినిమయదారీ దేశం. పర్షియా సింధుశాఖలో "టాంకర్‌యుద్ధం" ప్రారంభమైనప్పుడు, అమెరికా యీ ప్రాంతంలో తన సైనిక వునికిని కనీవినీ యెరుగనంతగా పెంచేందుకు దీన్ని అవకాశంగా తీసుకుంది. అమెరికా కేవలం చమురుకు సంబంధించి మాత్రమే తన ప్రయోజనాలను కాపాడుకుంటోందని విషయపరిజ్ఞానం లేనివారు అనుకోవచ్చు. వాస్తవానికి, అమెరికా దిగుమతి చేసుకునే ద్రవరూప యింధనంలో 6 శాతం మాత్రమే పర్షియా సింధుశాఖనుంచీ వస్తుంది. అందువల్ల, వ్యూహాత్మక, రాజకీయ ప్రయోజనాలే ప్రస్తుతం అమెరికా తీసుకుంటున్న చర్యల లక్ష్యమని భావించవచ్చు. అమెరికా అక్కడ తన ప్రాబల్యాన్ని పెంచుకోవడానికి చాలాకాలంగా కలలుగంటోంది. ఇరాన్‌గేట్ కుంభకోణం తర్వాత అమెరికా ఇరాన్‌కు వ్యతిరేకంగా వ్యవహరించడంద్వారా అరబ్‌రాజ్యాల కన్నీళ్ళు తుడవడానికిప్రయత్నిస్తోంది.

పర్షియా సింధుశాఖలో ఇరాన్ - ఇరాక్ ఘర్షణలు యథాప్రకారం కొనసాగేట్టు చూస్తూ, అమెరికా అక్కడ తన సైన్యాలను వుంచడానికి కారణం అమెరికాలో వట్టిపోతున్న చమురు నిల్వలే. కానీ పర్షియా సింధుశాఖదేశాల్లో చమురువుత్పత్తికి అయ్యేఖర్చు యితర దేశాల్లో అయ్యే ఖర్చుకన్నాతక్కువనీ, అక్కడున్న నిల్వలు దాదాపు తరిగిపోయేవికావనీ కూడా అందరికీ తెలుసు.

### అలవాటుగా మారిన యుద్ధం

ఇరాన్, ఇరాక్‌ల ఆంతరంగిక జీవితంలో చమురుకూడా నిర్ణాయకపాత్ర వహిస్తోంది. యుద్ధంమూలంగా యీ రెండు దేశాల్లో అనేక అభివృద్ధి ప్రాజెక్టులు ఆగిపోయాయి. కానీ చమురు వుత్పత్తి మాత్రం చాలా జోరుగా సాగుతోంది. నానాటికీ యెక్కువ చమురు వుత్పత్తి అవుతున్నప్పటికీ, యీ రెండుదేశాల ప్రజల జీవితాలు యేమీ మెరుగుపడలేదు, చమురు యెగుమతుల ఆదాయాల్లో యెక్కువభాగం యుద్ధానికే ఖర్చవుతోంది. యీ యిబ్బందులు తాత్కాలికమైనవని అక్కడి ప్రజలు సరిపుచ్చుకుంటున్నారు.

ఇరాక్‌లోని పరిస్థితి కొంత భిన్నంగా వుంది. దానికి భూమార్గ పైపులైనులున్నాయి. కాబట్టి చమురును ఓడలద్వారా రవాణా చేసే విషయంలో యిబ్బందులు తక్కువ; చమురు అమ్మకానికి సౌదీ అరేబియా, కువాయిట్‌ల తోడ్పాటు దానికి వుంది. విద్యార్థులను అది సైన్యంలో భర్తీచేసుకోవడం లేదు. ఇరాక్ సైనిక బలగం సంఖ్యావరంగా ఇరాన్ సైనికబలగంలో సుమారు మూడింట ఒకవంతు మాత్రమే వుంది. మతాధికారులు బోధించినట్లుగా సైనికులు మందు పాతరలమీద నడిచి, ఆత్మహత్యకు సిద్ధపడి వాటిని ధ్వంసం చేస్తే వారు నేరుగా స్వర్గానికి చేరుకుంటారనే దాన్ని ఇరాక్‌లో ఆచరణలో పెట్టడం లేదు.

ఇరాన్, ఇరాక్‌లలోని పరిస్థితిని పైపైన పరిశీలించినప్పటికీ, యుద్ధం కొనసాగించడానికి వుభయదేశాలకూ తగినన్ని వసరులున్నాయని అర్థమౌతోంది. వుభయపక్షాలూ యుద్ధాన్ని "పవిత్రమైనది" గా భావిస్తున్నాయి. కానీ, ముస్లింలు ఒకర్నొకరు చంపుకోవడంచూసి దేవుడు సంతోషిస్తాడని ఇస్లాం పవిత్రగ్రంథమైన ఖురాన్ చెప్పడంలేదు.

ఇప్పటికి 8 యేళ్ళుగా సాగుతున్న మారణకాండ షత్-అల్-అరబ్‌నదీ తీరానగల వివాదగ్రస్తమైన భూభాగ పరిధులనూ, యుద్ధమగ్నమైవున్న యీ దేశాల ప్రయోజనాలపట్ల శత్రుభావంతో యిందులో తలదూర్చిన దేశాలపరిధులనూ దాటిపోయింది. కాబట్టి, యీ యుద్ధం నిరర్థకమైనదనీ, అనంతమైనదనీ స్పష్టంగా తేలిపోయింది. యిది అంతంకావాలంటే శాంతికోసం సంప్రతింపులు జరపడం తప్ప మార్గాంతరం లేదు.

— "నోవయె వ్రేమ్యా" పత్రిక నుంచీ

## మతం



# మెట్రోపాలిటన్ దవీద్

## "శాంతే జీవిత ధ్యేయం

సుఖుమై, అబ్‌ఖాజియా ప్రాంతాలకు చెందిన మెట్రోపాలిటన్ దవీద్ వయసు 62. ఓహియో రాష్ట్రంలోని అక్రాన్ యంగ్‌స్టటన్ బచెర్లిష్ కెంటకీలోని లూయిస్‌విల్లె, టెక్సాస్‌లోని ఫోర్ట్‌వర్త్, న్యూజెర్సీలోని గార్‌ఫీల్డ్ — యీ ఆరు అమెరికా నగరాలలోనూ ఆయనకు గౌరవ పౌరసత్వం వుంది.

అనన్సియేషన్ కెథడ్రల్‌లో ఆయనను సోవియట్ లైఫ్ విలేకరులు కలుసుకున్నారు. అబ్‌ఖాజియా రాజధాని సుఖుమై నడిబొడ్డున యీ

కెథడ్రల్ వుంది. యిది జార్జియా సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌లో చేరిన స్వయం పాలిత రిపబ్లిక్ కెథడ్రల్ భవనానికి మరమ్మతులు జరుగుతున్నాయి. ఇటుకలు అమర్చేవారు, కళాకారులు, ప్లాస్టరింగ్ పనివారు పైకప్పుబాగు చేసేవారు యిలా అనేక మందితో మాట్లాడడం కోసం ఆయన మా యింటర్వ్యూను అనేక పర్యాయాలు మధ్యలో నిలుపు చేయాల్సి వచ్చింది. నిర్మాణప్పని కోసం కట్టిన మంచెల మీద, చర్చి ఆవరణలో, చర్చి లోపల వర్ణచిత్రాల ముందు, పైకప్పుకు వెళ్లేమెట్లమీద ఎక్కడ చూచినా ఆయనే అన్నట్లు పనులు అజమాయిషీ చేస్తూ తిరగడం కనిపించింది.

మా సంభాషణ అంతా యిష్టాగోష్టిలాగా సాగింది.

"మత గురువును కావడమే నా గమ్యం అని నాకు చిన్నప్పటి నుంచీ తెలుసు. నా తాత గారు, తండ్రిగారు యింకా కొందరు బంధువులు మత గురువులుగా బాధ్యతలు నిర్వహించారు. అయితే కాలగతి మరో విధంగా వుంది. నా వయసప్పుడు ఏడో ఎనిమిదో. మా నాన్నగారికి తీవ్ర అస్వస్థత ఏర్పడింది. నేను తప్ప మిగిలిన అందరూ ఆశ వదలుకున్నారు. చేయగలిగినంత వరకూ తాను చేస్తానని డాక్టరు నాతో అన్నారు. అందువల్ల మా నాయన తప్పకుండా కోలుకుంటాడన్న నమ్మకం నాకేర్పడింది. డాక్టరు మాటల్ని నేనెప్పటికీ మర్చిపోలేను. రోగులకు సాయం చేసేందుకు నేనూ ఒక డాక్టర్ను అవాలి అని కలలు కనడం ప్రారంభించాను. నేను దంత వైద్యుణ్ణి అయ్యాను."

దవీద్ మొదట నుంచీ ఆస్తికుడే తన తాత, తండ్రి చేపట్టిన ఆశయాన్ని ముందుకు తీసుకు పోవడానికి ఆయన చర్చి ఒడిలో చేరారు.

"దేహ బాధల కన్నా ఆత్మకు కలిగే బాధల గురించి నేనెక్కువ శ్రద్ధ వహిస్తాను." అంటారాయన.

తన తండ్రి గారి మత గ్రంధాలన్నీ ఆయన చదివాడు. ధియొలాజికల్ సెమినరీలో తనను నమోదు చేసుకున్నాడు. బిషప్ అయినాక ఆయన ఒక జిల్లా ప్రాంతానికి మతాధిపత్యం స్వీకరించారు. ఆ పదవిలో ఎంతో కృషి చేశారు. కొత్తగా ఒక చర్చిని నెలకొల్పారు. మతాలలో కొత్త శాఖలను విస్తరింపచేశారు. ఆయన ఆధిపత్యానగల జిల్లాలో 20 చర్చీలు వున్నాయి. అబ్‌ఖానియన్‌లు, జార్జియన్‌లు, ఆర్మేనియన్‌లు, గ్రీకులు, రష్యన్‌లు, ఉక్రేనియన్‌లు యింకా యితర జాతులకు చెందిన భక్తులు ఆ చర్చీలకు వస్తుంటారు.

"మా రిపబ్లిక్‌లో శాంతి మైత్రిలను అతి ముఖ్య విషయాలుగా పరిగణిస్తారు. అయితే శాంతి అనేది ఒక్కరోజు కూడా లభించని కష్టకాలాన్ని జార్జియా భరించింది. జార్జియాలోని వారు ఉదయాన పనిలోకి వెడుతూ కుటుంబ సభ్యులను కూడా తనతో తీసుకువెళ్లాల్సిన పరిస్థితులవి. లేకపోతే కుటుంబానికి రక్షణ వుండేది కాదు. ఒకచేత్తో పొలం దున్నుతూ, మరోచేత్తో కత్తిపట్టుకుని తన ప్రాణాన్ని తనవారి ప్రాణాల్ని రక్షించుకోవాల్సి వచ్చేది. ప్రపంచంలో యీ రోజున అణ్వాస్త్రాలు కుప్పతెప్పలుగా పడివున్నాయి. అందువల్ల కుటుంబసభ్యులను రక్షణ కోసం తమతో పొలాలకు తీసుకు వెళ్లి ప్రయోజనం వుండదు ఎక్కడ నుంచి మృత్యు ప్రభంజనం వీస్తుందో ఎవరూ చెప్పలేరు. అది ఖండాలకు ఖండాలనే నిర్ధూమధామం చేయగలదు.

శాంతి స్థాపన అనేది తన ప్రధాన ధ్యేయాలలో ఒకటిగా సర్వదా వుంటూ వచ్చిందంటారు మెట్రొపాలిటన్ దవీద్

"మానవ నాగరికత ముప్పు నెదుర్కొంటోందని ఒక సాధారణ మానవునిగా నేను అర్థం చేసుకున్నాను. ప్రజల గురించి వారి ఆకాంక్షల గురించి ఆలోచించడం ఒక మత గురువుగా నా ధర్మం. మానవుని కష్టాలు ఎలా వుంటాయో ఒక వైద్యునిగా నాకు తెలుసు."

"సోవియట్ శాంతి ఉద్యమంలో భిన్న విశ్వాసాలకు చెందిన వారందరూ పాల్గొంటున్నారు. మానవాళి జీవితంలో అత్యంత బాధ్యతాయుతమైన అలాటి ఉద్యమంలో పాల్గొనకుండా ఏమీ పట్టించుకోని ప్రేక్షకురాలుగా చర్చి వుండి పోగలదా?

"దుష్టశక్తిని ఎదుర్కొని పోరాడటం ఒక నిజమయిన క్రిస్టియన్ తప్పనిసరి కర్తవ్యం. అన్యాయమైన యుద్ధం దానివల్ల వచ్చిపడే కష్టాలు యివన్నీ దుష్టత్వానికి రూపం. అందువల్లనే శాంతి స్థాపన మతం ప్రోద్బలించే పవిత్ర కర్తవ్యం. విశ్వ వినాశనానికి దారితీసే దేనినైనా సహించరాదు. అలా సహించడమంటే దుష్టత్వాన్ని సహించడమే. అది పాపం.

"అందువల్లనే నేను కూడా దానికి దూరంగా వుండడం అసాధ్యం. నా హృదయాన్ని బుద్ధిని భవిష్యత్తు వేపు మరల్చాలి. నాకు నేను యిలా చెప్పుకుంటాను. శాంతికోసం జీవించడమంటే

ఆస్తికులందరికోసం యావన్మంది ప్రజల కోసం జీవించడమని అర్థం. లేకుంటే జీవితమే అర్థ రహితమై పోతుంది.

"శాంతి కాంక్షఅంటే సోమరితనం కాదు. అది ప్రజల పట్ల క్రియాశీల ప్రేమ. అంతేకాదు. అత్యంత చీకటి శక్తుల సృష్టికి దారితీసే యుద్ధం అనేది మర్చిపోవల్సిన గతకాలపు విషయంగా మారే పరిస్థితిని ప్రపంచంలో నెలకొల్పాలన్న అవగాహన కూడా.

"సృష్టి అయిన దానిని పరిరక్షించడం; ఆయుధాలు, యుద్ధాలు లేని ప్రపంచాన్ని నెలకొల్పడం, సకల దేశాల మధ్య సోదర సంబంధాలనూ మానవ కార్యాచరణ రంగాలన్నిటిలో సహకారాన్నీ పెంపొందించడం — యివన్నీ మన ఉమ్మడి బాధ్యతలు.

"అందరూ కృషి చేస్తేనే శాంతి స్థాపన సాధ్యం దేశ దేశాల ప్రజల ఉమ్మడి అభీష్టం - యిదొక్కటే పుడమి భవితవ్యాన్ని నిర్ణయించగలదు. గతంలో కూడా అదే జరిగింది. నాజీజాన్ని తుద ముట్టించేందుకు ఐక్యతే ఆయుధమైంది. భావజాల పరంగా ఎన్నో తేడాలున్నప్పటికీ సోవియట్ యూనియన్ అమెరికాలు రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో మిత్ర దేశాలుగా నిలిచాయి మన ఇరు దేశాల సైనికులు ఒకర్నొకరు విశ్వసించారు. వారివారి ధైర్య సాహసాలను పరస్పరం గౌరవించుకున్నారు. ఈ రోజున గూడా గంభీరమైన సమస్యలను ముఖ్యంగా మన ఉమ్మడి శత్రువు అయిన అణ్వాస్త్ర ప్రమాదాన్ని మన సంయుక్త కృషి, ఉమ్మడి అభీష్టంతో ఎదుర్కోనాల్సి వుంది. మన రెండు దేశాలు ఉమ్మడిగా కృషిచేస్తే ఎంతో సాధించగలవు. యిది సత్యం.

"అమెరికన్లలోయిలా ఆలోచించేవారు చాలా మంది వున్నారు. సమకాలీన ప్రధానసమస్యలపై మన రెండు దేశాలు ఒక అంగీకారానికి రావడం అవసరమని అమెరికా ప్రజలు గ్రహించారు. యిది నాకు ఎన్నో పర్యాయాలు నిర్ధారణ అయింది. ఎందరో రాజకీయవేత్తలు, వ్యాపారులు, సాధారణ ప్రజలు, మత ప్రముఖులు నాకీ విషయం చెప్పారు. ప్రచ్ఛన్న యుద్ధ కాలంలో రెండు దేశాలలోని చర్చీల ప్రతినిధులు సంభాషణలు ఆరంభించారు. అతి కఠినమయిన ఆ రోజులలో మనకున్న అతి కొద్ది సంబంధాలలో యీ సంభాషణలు కూడా ఒకటి. అమెరికా టూరిస్టుల బృందం ఒకటి నన్ను ఒకప్పుడు కలుసుకుంది. వారిలో ఒక టూరిస్టు ఒక కార్డును నాకు యిచ్చారు. అందులో రష్యన్‌లోనూ, ఇంగ్లీషులోనూ యీ కింది మాటలు వున్నాయి. "నా పేరు రెవరెండ్ గొర్డన్‌డ్రాగ్ట్. అమెరికాలోని ఉత్తర కరొలినాలో చేపెల్ హిల్ చర్చిలో మత గురువును.

"ఈ కార్డు వెనక భాగాన ముద్రించిన పేర్లు గల వ్యక్తుల నుంచి శాంతిమైత్రి అభినందనల సందేశాన్ని నేను తీసుకువచ్చాను. నేను యీ శాంతి యాత్ర జరిపేందుకు యీ వ్యక్తులందరూ ద్రవ్యసహాయం చేశారు. అమెరికా సోవియట్ యూనియన్ ప్రజల మధ్య ప్రభుత్వాల మధ్య ప్రభుత్వాల మధ్య మైత్రి సుహృద్భావం శాంతి సంబంధాలు నెలకొంటాయని మా ఆశంశ."

డిసెంబరు 6న గొర్బచేవ్ - రీగన్ సంభాషణల సందర్భంగా వాషింగ్టన్ కేథడ్రల్‌లో ఉత్సవ పూజలు జరిగాయి. నాలుగు రాత్రుళ్లు, నాలుగు పగళ్లు అమెరికాకు సోవియట్ యూనియన్‌కు చెందిన వివిధ క్రిస్టియన్ చర్చీల ప్రతినిధులు సోవియట్ అమెరికా సంబంధాలు మెరుగుపడాలని కోరుతూ అక్కడ ప్రార్ధనలు చేశారు. అలా ప్రార్ధనలు జరిపిన వారిలో మెట్రో పాలిటన్ దవీద్ కూడా వున్నారు.

"సోవియట్ అమెరికా సంబంధాలలో మేలు దిశగా మార్పు ఎట్టకేలకు ఆరంభంగావడం చూస్తున్నాం. ఇది యితర దేశాలకు కూడా లాభదాయక మవుతుంది. ఒక చోట పుట్టిన మంచితనం మొలకలు, యితర చోట్ల మంచితనం మొలకెత్తడానికి తోడ్పడతాయి. ఉన్నత బాధ్యతా భావంతో, మంచితనం మీద పవిత్రమయిన విశ్వాసంతో ప్రకాశితమైన విజ్ఞత తప్పక గెలిచి తీరుతుంది. వ్యూహాత్మక దాడి ఆయుధాలలో 50 శాతం తగ్గింపు ఒప్పందంపై సంతకాలు చేయడం ద్వారా శాంతి పటిష్టీకరణ దిశగా మరో గంభీరమయిన ముందంజను మాస్కోలో సోవియట్ అమెరికా శిఖరాగ్ర సమావేశం వేయగలదని నేను ఆశిస్తున్నాను. చీకటి శక్తులు పలాయన మౌతాయి. యుద్ధాలు, దుష్టత్వం, దౌర్జన్యం లేని ప్రపంచం మానవాళికి స్థాపితమవుతుంది. అలాటి సమయం సాధ్యమైనంత త్వరలో వచ్చేలా చేయడం ప్రతి ఒక్కరి పవిత్రధర్మం."

# లేఖలు

## ఆకర్షణీయమైన పత్రిక

కొత్త ముస్తాబులో వచ్చిన మానవపత్రిక **సోవియట్ సమీక్ష** చాలా ఆహ్లాద కరంగా ఉంది. ప్రతిసంచిక ముఖపత్రంపై కేవలం శీర్షికలు కాక ఒక ఛాయా చిత్రం ఉంటే బాగుంటుంది. ప్రతి సంచికలో చిన్న కథ, హాస్యోక్తులు వుండాలని నా అభిలాష.

**—ఆర్. అముద,**

వాదుగ విరుచ్చియూర్, తంజావూర్ జిల్లా

సాహిత్యంపైనా సాహిత్య కారులపైనా వ్యాసాలు **సోవియట్ సమీక్ష** లో విధిగా ప్రచురిస్తున్నాము. ముఖ్యంగా భారతదేశంపై సోవియట్ రచయితల సాహితీ రచనలకు తోడు ఈ పత్రిక చివర్లో హాస్యోక్తులు కూడ ఉంటాయి. మా సోదరపత్రిక **సోవియట్ భూమి** ప్రతి సంచికలోనూ ఒక కథ ప్రచురిస్తున్నాము. —సం॥

## గ్లాస్నోస్త్, పెరిస్త్రోయికాల సమ్మేళనం

**సోవియట్ సమీక్ష** మరింత ఆకర్షణీయంగా తయారైంది. దీనిలో వ్యాసాలను బట్టి గ్లాస్నోస్త్ పెరిస్త్రోయికాలు సమరసంగా సమ్మిళితం అయినట్టు స్పష్టంగా రుజువు అవుతోంది. వచ్చే సంచికల్లో కూడా ఈ ప్రమాణాన్ని నిలబెడతారని ఆశిస్తున్నాను.

సోవియట్ యూనియన్‌ను గురించిన ఈ దిగువ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిందిగా అభ్యర్థిస్తున్నాను :

కొన్ని పాశ్చాత్య ప్రసార సాధనాలు చెబుతున్నట్టుగా సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగం ఉందా?

2. సోవియట్ యూనియన్‌లో మీరు అందాల పోటీలు నడుపుతున్నారా?

**— సి. కె. శశిధరన్,**

కాడుకాచువాడు, మీతల పొన్ను,

కోడుంగల్లూరు-680 669

ప్రశంసను సవినయంగా స్వీకరిస్తూ పత్రిక ప్రమాణాన్ని నిలబెట్టుకోవడం కోసం కృషి చెయ్యడమే గాక, దీన్ని మరింత మెరుగుపరుస్తామని కూడా గౌరవనీయులైన మా పాఠకులకు హామీ ఇస్తున్నాం. యిక మీ ప్రశ్నలకు సమాధానాలు :

మా దేశంలో ఇప్పటికి ఐదు దశాబ్దాలకు పైగా నిరుద్యోగం లేదు.

2. అవును. ఫాషన్, అందాల ప్రదర్శనలు ఇప్పుడు సోవియట్ యూనియన్‌లో ప్రజాదరణ పొందాయి.

సం॥.

## గుణాత్మక సమాచారం

సోవియట్ సమీక్ష నూతన సంవత్సర ప్రథమ సంచిక చూడగానే ఎంతో సంతోషం వేసింది. కూర్పులో, ముద్రణలో, వ్యాసపరంపరలో నూతనత్వమే గాక విషయసమీకరణ గుణాత్మకంగా ఉంది. నా అభినందనలు స్వీకరించగోరెదను.

భవదీయుడు,

**వావిలాల గోపాల కృష్ణయ్య.**

(అధికారభాషా సంఘం మాజీ అధ్యక్షుడు)

సత్తెనపల్లి, గుంటూరు జిల్లా

## ఉపయోగకరమైన సంభాషణ

కొత్త ముస్తాబులో వెలువడిన **సోవియట్ సమీక్ష** చదివి, సంపాదక పేజీలో మీరు ప్రకటించిన లక్ష్యాలను మెచ్చుకుంటున్నాను. "పాఠకుల లేఖల" పుటలో మా అభిప్రాయాన్ని ప్రకటించే అవకాశాన్నిచ్చినందుకు కృతజ్ఞతలు. పత్రిక మెరుగు పడడానికి ఈ శీర్షిక తోడ్పడుతుంది.

**— దిగవల్లి వెంకట శివరావు,**

**విజయవాడ (ఏ.పి.)**

**సోవియట్ సమీక్ష** కొత్త ముస్తాబులో చక్కగా ఉంది, క్రీడారంగానికి కొన్ని పుటలను కేటాయించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

**— బి. హమీదుల్లా,**

**అనంతపురం (ఏ.పి)**

## కంటికి, మనసుకు విందు

సోవియట్ సమీక్షలో మార్పులు కంటికీ, మనసుకూ విందులే. సోవియట్ ప్రజ, చరిత్ర సంస్కృతి మొదలైన వాటిపై వ్యాసాలు బాగున్నాయి.

**— తాండవ రాయన్,**

తిరువన్నామలై

(ఉత్తర ఆర్కాట్ జిల్లా)

మీ మెప్పు, సూచనలు యెంతో విలువైనవని మా భావం. క్రీడాభిమానులయిన మా పాఠకులు మా సోదర పత్రిక **యూత్‌రివ్యూకు** చందా దారులుగా చేరాలని మా సలహా. అందులో క్రీడలకు సంబంధించిన వార్తలు ఉంటాయి:

— సం.

# భారతదేశంలో దస్తయేవ్‌స్కీ వారసత్వం

యెవగెనీ చెలిషెవ్

సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ కరస్పాండింగ్ సభ్యుడు, జవహర్లాల్ నెహ్రూ బహుమతి గ్రహీత.



దస్తయేవ్‌స్కీ

భారతదేశం దస్తయేవ్‌స్కీని గురించి ఈ శతాబ్ద ప్రారంభంలో తెలుసుకొంది. బానిసత్వంలో మగ్గుతున్న తమ దేశ ప్రజల దుస్థితిని అందరిదృష్టికీ తేవడానికి ప్రజాతంత్రవాద రచయితలు పాటుపడుతూ వచ్చిన కాలమిది "తృణీకృతులూ, అవమానితులూ" అన్యాయమైన సామాజిక వ్యవస్థల మూలంగా వికృతమైన ఆత్మలతో పడే మనోవేదననూ, వారిలో రగుల్కొనే ఆగ్రహాన్ని చిత్రించడంలో దస్తయేవ్‌స్కీకి ప్రపంచంలో మరే రచయిత దీటురాడు. అందువల్ల, సామాజిక అన్యాయానికి విషాదకరంగా బలి అవుతున్న మానవుణ్ణి చిత్రించే మార్గాలు వెదుకుతూన్న భారతీయ రచయితలను, దస్తయేవ్‌స్కీ ఆకర్షించడం సహజమే.

లియోతోల్‌స్తాయి లాగా దస్తయేవ్‌స్కీ కూడా భారతీయుల దృష్టిలో కేవల కల్పనా సాహితీకారుడు మాత్రమే కాదు. ఆయన తత్త్వం, నీతి, మత బోధకుడు కూడ. వలస పాలనా కాలంలో, మహాత్మాగాంధీ భావాలు దేశంలో వ్యాపించడంతో, తమదేశంలో దస్తయేవ్‌స్కీ పట్ల మొదటిసారిగా ఆసక్తి వ్యక్తమయిందని పలువురు భారతీయ గ్రంథకర్తల అభిప్రాయం.

భారతదేశం స్వతంత్రమైన తరువాత, అనేక సాహిత్య, రసాభిజ్ఞతా ధోరణులకు, సిద్ధాంతాలకు ప్రాతినిధ్యం వహించేవారు ఈ రష్యన్ ప్రసిద్ధ గ్రంథకర్తను భిన్న దృక్పథాలతో అంచనా కడుతున్నారు. ప్రతి ఒకరూ దస్తయేవ్‌స్కీలో తన భావాలకు, అభిరుచులకు దగ్గరగా వున్నవాటినే చూస్తున్నారు. ఆయన పరస్పర విరుద్ధ భావాలూ, బహుముఖ గ్రంథాలూ అన్ని రకాల వారికీ విందుచేయటం ఆశ్చర్యం కాదు.

దస్తయేవ్‌స్కీపై భారతదేశంలో జరిగిన చర్చల్లో నేను పలుసార్లు పాల్గొన్నాను. ప్రముఖ హిందీ

వచన రచయిత ఇలా చంద్రజోషీతో 1950 లలో ఆయన్ను గురించి మాట్లాడాను. కొన్ని సంవత్సరాల తరువాత జోషి సహరచయితలయిన జైనేంద్ర కుమార్, ఆగ్యేయలతో కూడ మాట్లాడాను. తక్కిన వారందరికన్న ఈ ముగ్గురిపైనా దస్తయేవ్‌స్కీ ప్రభావం యెక్కువగా వుందని అనుకొంటున్నాను. ఇలా చంద్రజోషీతో నా సంభాషణ నా మనసుపై గాఢముద్ర వేసింది. ఆ సంభాషణలోని ప్రతి వివరమూ నాకిప్పటికీ గుర్తుంది. దస్తయేవ్‌స్కీ రచనలను జోషి లోతుగా అధ్యయనం చేసిన వ్యక్తి. తను ఆ రష్యన్ రచయితకు యెంతో రుణపడివున్నానని గుర్తించాడు. రష్యన్లకు కూడ జోషి పరిచితుడే. ''జహాజ్కీ పంఛీ'' అనే ఆయన నవల రష్యన్ అనువాదం సోవియట్ యూనియన్‌లో వెలువడింది.

హెచ్.బజాజెనోవా తప్ప, సోవియట్ ఇండాలజిస్టులు భారతదేశంలో దస్తయేవ్‌స్కీ రచనల వ్యాప్తి పట్ల యేమాత్రమూ శ్రద్ధ చూపడంలేదు. బజాజెనోవా 1971 లో సోవియట్ విజ్ఞాన శాస్త్ర అకాడమీకి చెందిన ప్రాచ్యవిషయ అధ్యయన సంస్థలో కాండిడేట్ డిగ్రీకోసం "జోషి కృషిలో మౌలిక దశలు" అనే సిద్ధాంత రచన చేశారు. జోషి పుస్తకాల్లో దస్తయేవ్‌స్కీ ప్రభావం వున్నట్టు యెన్నో వివరాలు, నిర్ధారణలు ఆమె యిచ్చారు. యస్. సెరెబ్రియానీ, యల్. నరస్కినాలు దస్తయేవ్‌స్కీ, టాగూర్‌కు మధ్య ఆసక్తికరమైన పోలికలున్నట్లు వివరించారు. అంతేతప్ప సోవియట్ రచయితలెవ్వరూ ఈ విషయం పట్టించుకోలేదు. భారతదేశంలో దస్తయేవ్‌స్కీ వారసత్వాన్ని సామాన్యీకరించే రచన యేదీ భారతీయ పండితులు యింతవరకు రాయలేదు. అయితే, ఈ విషయానికి సంబంధించిన వేరువేరు అంశాలను పలువురు గ్రంథకర్తలు ప్రస్తావించారు.

దస్తయేవ్‌స్కీపై భారతీయుల అభిప్రాయాలు రూపుగొన్న తీరు; ఆయన సృజనాత్మక రచనలపైనా, ఆయన తాత్వికతపైనా, భారతీయుల అభిప్రాయాలను బేరీజు వేయటం; దస్తయేవ్‌స్కీ ఆవిష్కరించిన అంశాలను భారతీయ రచయితలు యెలా వుపయోగించు కొన్నారో వెల్లడించడం; భారతదేశంలో దస్తయేవ్‌స్కీ రచనల అనువాదాలను, ఆయన భావాల వ్యాప్తిని సమాహరించడం - వీటినన్నిటినీ సాహిత్య చరిత్రకారులు యింకా చేపట్టలేదు. ఈ సమస్యలు ముఖ్యమైనవి. రష్యన్ భారతీయ సాహిత్యాల సంపర్కాన్ని యివి తెలియ జేయడమే కాదు, సమకాలీన భారతీయ కల్పనా సాహిత్యంలో మనస్తత్వ పరిశీలనా ధోరణి ఆవిర్భవించి, సుస్థాపితమైన తీరుకు సంబంధించిన విషయాలివి.

బ్రిటిష్ వరాయి పాలనలో, భారతదేశం దస్తయేవ్‌స్కీని గురించిన బ్రిటిష్‌వారి అభిప్రాయాన్ని స్వీకరించింది. దస్తయేవ్‌స్కీని ఒక గొప్పవాస్తవిక రచయిత అనికాక నిగూఢమైన రష్యన్ అంతరాత్మను వేధిస్తున్న చీకటి శక్తుల గాయకుడని బ్రిటిష్‌వారి అభిప్రాయం. ఈ రచయితను రష్యన్ సామాజిక నేపథ్యం నుంచి వేరుచేసి చూడటంవల్ల యేర్పడ్డఅభిప్రాయమిది.అమెరికన్ పరిశోధకులకు, అంతకన్న యెక్కువగా జర్మన్‌పరిశోధకులకు దస్తయేవ్‌స్కీని గురించి మార్మిక భావాలు, మతపరమైన భావాలుండేవి. అవి పలువురు భారతీయ సాహిత్యకారులకు నచ్చాయి. దస్తయేవ్‌స్కీ వాస్తవికతావాది అయిన రచయితగాకాక, వ్యక్తావ్యక్త చైతన్యపు చీకటికోణాల గురించి గానం చేసిన వ్యక్తి అనీ, బాధలనుభవించమని బోధించిన ప్రచారకుడు, అజ్ఞేయ విషయ సంకీర్తనలో తన్మయుడైన కవి అనీ మిడిల్‌టన్ మూరీ భావన. దస్తయేవ్‌స్కీపై భారతదేశంలో వెలువడిన అనేక రచనలకు ఇదే ప్రేరణ అని మనకు స్పష్టమవుతోంది.

భారతీయ సాహిత్యంలో ప్రయోగవాద స్థాపకుల్లో ఒకరైన ప్రముఖ హిందీ రచయిత ఆగ్యేయ దృష్టిలో విప్లవోద్యమం వ్యక్తి చేసే అరాచక తిరుగుబాటు తప్ప వేరు కాదు; అత్యాశ, అధికార దాహమే విప్లవకారుల వాహిక. ఆయనకు ముందు, దస్తయేవ్‌స్కీ కూడ యిలాగే భావించారు.

భగ్నమైన సామాజిక భ్రమలు దస్తయేవ్‌స్కీ రచనలకు ఒక విషాదకరమైన రంగుపులిమాయి. స్వాతంత్ర్యంతో నిజమవుతాయని తాము పెట్టుకొన్న ఆశలు పటాపంచలు కావడంవల్ల భారతీయ రచయితలకు ఈ రష్యన్ సాహితీకారునితో ఆత్మిక బాంధవ్యం యేర్పడింది.

భారతీయ సాహిత్య విమర్శకుల్లోని అస్తిత్వవాదులు దస్తయేవ్‌స్కీ రచనలను, కళ, మానవ అంతరంగాలు హేతువిరుద్ధమైనవన్న క్షీణసాహిత్య దృష్టితో చూస్తున్నారు. అస్తిత్వవాద రసాస్వాదన విశ్వజనీనమైనదనీ, భారతీయ సాహిత్య క్షేత్రంలో నాటిన పాశ్చాత్య ఆధునిక వాదం మూడుపువ్వులూ, ఆరుకాయలుగా వర్ధిల్లుతూందనీ రుజువు చేయ

డానికి వీరు, దస్తయేవ్‌స్కీ ప్రభావాన్ని ఉపయోగించు కొంటున్నారు.

1971 లో ఢిల్లీలో ప్రచురితమైన "హిందీ ఉపన్యాస్ పర్ పశ్చిమీప్రభావ్" అన్న తన పుస్తకంలో భారత్ భూషణ్ అగర్వాల్ యిలా రాస్తు న్నారు: "దస్తయేవ్‌స్కీ కథానాయకుల మనోభావాలతో, ఆయన రచనల్లో నిబిడీకృతమైన బాధాకర విషాదంతో ఇలా చంద్రజోషీ పాలు పంచుకొంటున్నారు. కష్టాలూ, బాధలతో నిండిన ఆ జీవితం దస్తయేవ్‌స్కీ అద్భుత వచనరచనకు సారవంతమైన క్షేత్ర మయింది. ఫ్రాయిడ్ కన్న చాలా నాళ్ల క్రితమే, సునిశిత మనస్తత్వ విశ్లేషణాప్రతిభతో దస్తయేవ్‌స్కీ రచనలు పాఠకులను ఆకట్టుకున్నాయి"
అయితే జోషీ తన రచనల్లో దస్తయేవ్‌స్కీకి దీటు కాలేకపోయాడనీ, తనకు ప్రామాణికుడైన రష్యన్ నవలాకారుడు చూచినంత లోతుగా తన కథ నాయకుల హృదయాలను మనసులను తరచి చూడలేకపోయారని అగర్వాల్ వాపోయాడు ఆయన దృష్టికి కారణమిదీ : దస్తయేవ్‌స్కీ కఠోర మైన జీవితకష్టాలను తుదకంటాచవిచూచారు, జోషి అంతటి కష్టాలెరగడు.

ప్రయోగవాద ధోరణికి చెందిన కొందరు భారతీయ రచయితలు దస్తయేవ్‌స్కీని తమ అపసవ్యదృష్టితో చూచారు. వారు రోగగ్రస్తమైన మానసిక పరిస్థితిని, మనోవైపరీత్యాలను, సమాజంలో అధఃపతితుల జీవితబీభత్సాలను కళాత్మకప్రమాణాల స్థాయికి తీసుకెళ్ళారు. తమ చుట్టూ గల ప్రపంచాన్ని తిరస్కరిస్తూ, సదావిచారంతో కుమిలిపోయే రోగభ్రమగ్రస్తులైన దస్తయెవ్‌స్కీ పాత్రలకూ, అస్తిత్వవాద కళోపాసనకు చెందిన భ్రమచిత్తుల వ్యక్తిత్వానికీ మధ్య సారూప్యముందని యస్. బందోపాధ్యాయ అంటున్నారు. "దస్తయేవ్‌స్కీ, కాఫా తదితర పాశ్చాత రచయితలకు అస్తిత్వ వాదంతో అవినాభావ సంబంధముంది" అని "సోనార్ అల్పనా" లో(కలకత్తా, 1960 పుట 62; బెంగాలీభాషలో) ఆయన రాశారు.

"దస్తయేవ్‌స్కీ, నీషే, రిల్కే, కాఫ్కా, కామ్యస్-వీరంతా అస్తిత్వవాదులు. వారి వ్యక్తివాదం తీవ్ర రూపాలను సంతరించుకొంది...యింతవరకు వెలువడ్డ రచనల్లోకెల్లా 'అజ్ఞాతవాసం నుంచి ఉత్తరాలు' అనేవి అస్తిత్వ వాదంతో వియ్యానికి బహు చక్కని ప్రయత్నం, అని అమిత్‌గుప్త తన "విశ్వసాహిత్య" లో రాస్తున్నారు.

మరోవైపు ప్రజాతంత్రవాదులైన భారతీయ రచయితల దృష్టి దీనికి పూర్తిగా భిన్నమైనది. మనిషి అనాదినుంచి జన్మతః పాపి అనేది దస్త యేవ్‌స్కీ అభిప్రాయమనడం వారు ఒప్పుకోరు. ఆయన క్రౌర్యాన్ని పాపాన్ని కీర్తించిన కవి అనే మాటను వారు అంగీకరించరు. వారు తమ సాహిత్య సైద్ధాంతిక అన్వేషణలకు సరిపోయిన వాటిని దస్త యేవ్‌స్కీ నుంచి స్వీకరించారు. దేవునిపైనా, మతంపైనా ఆయనకు గల విశ్వాసం జైనేంద్ర కుమార్‌ను, ఇలాచంద్రజోషీని ఆకర్షించాయి. "దస్తయేవ్‌స్కీ జీవిత భయంకర దృశ్యాలను మనకు ఆవిష్కరించి, వీటినుంచి తప్పించుకొనే మార్గం దేవునిపై విశ్వాసమే అని తెలిపారు" అంటూ జైనేంద్రకుమార్ తన "సమయ ఔర్ మై" లో రాశారు (ఇది ఢిల్లీలో వెలువడ్డ హిందీ రచన)

మహాత్మాగాంధీ భావాలను అంగీకరించే భారతీయ రచయితల దృష్టిలో దస్తయేవ్‌స్కీ క్షమా, బాధాసహిష్ణుత, నమ్రత, అందరినీ సోదరుల్లా ప్రేమించడం - ఇవి మోక్షానికి మార్గమని బోధించిన ప్రచారకుడు. ఇది హిందూ తత్వ శాస్త్రంలో పేరూనిన భారతీయ సాంప్రదాయక నీతికీ, బాధాతప్తతను పవిత్రంగా యెంచిన బౌద్ధ దృక్పధానికి దగ్గరగా వున్నాయని వారు అభిప్రాయ పడుతున్నారు. దస్తయేవ్‌స్కీ చిత్రించే దౌష్ట్యం, హింస కాదు ముఖ్యం, ఆయన కీర్తించే మంచితనం, సహనం మహాత్మాగాంధీ సత్యాగ్రహానికి అనుగుణంగా వున్నాయని వీరివాదం. సుప్రసిద్ధ హిందీ రచయిత అమృత్‌లాల్ నాగర్ రాసిన "బుంద్, ఔర్ సముద్ర" లోని మతప్రచారకుడు రామాజీ ధర్మబోధనలనే తీసుకోండి. అవి కథా నాయకుడైన సుజన్‌ను తన ఆత్మశుద్ధికి ప్రేరే పిస్తాయి. వారిద్దరి మధ్య సంబంధం, ఫాదర్ జోసిమాకు, అల్యోషాకరామీజోవ్‌కు మధ్య సంబంధాన్ని పోలివుంది. ఇలాచంద్రజోషీ "జహాజ్ కీ పంచీ" నవలలోని కథానాయకుడు తన్నుతాను యిలా ప్రశ్నించుకొంటాడు. "బాధ లనుభవించాలన్న నిర్నిరోధకమైన కోర్కె నాలో యెందుకు కలుగుతోంది?" "నేను బాధలను భవించాలని కోరుకుంటున్నాను. బాధలనుభవిస్తే నేను పరిశుద్ధుడ నవుతాను" అనే ద్మిత్రీకరమజోవ్ మాటలకు పై ప్రశ్న ప్రతిధ్వని.

కాని పాపాన్ని నేరస్తులపట్ల కరుణను దస్తయేవ్‌స్కీ సమర్థించడం భారతీయ రచయితలకు అంగీకార యోగ్యంగా కనిపించలేదు. అవి వారి దేశసాంప్రదాయక నీతి సూత్రాలకు విరుద్ధమైనవి. ఇలాచంద్రజోషీపై "నేరమూ, శిక్ష" అనే దస్తయేవ్‌స్కీ నవల ప్రభావాన్ని గురించి చర్చిస్తూ బి.బి. అగర్‌వాల్ పైన పేర్కొన్న ఆయన రచన "హిందీ ఉపన్యాస్ పర్ పశ్చిమీప్రభావ్" లో యిలా రాస్తున్నారు. తన కథానాయకుల అంతఃప్రపంచాన్ని లోతుగా శోధించే కళను దస్తయేవ్‌స్కీ నుంచి జోషీ స్వీకరించినప్పటికీ, దస్తయేవ్‌స్కీ నైతిక సూత్రాలను నేరస్తుల పట్ల దయను అరువు తెచ్చుకోలేదు. ఆ వైఖరి భారతీయ రచయితలకు ఆమోదయోగ్యం కాదని ఆయన అభిప్రాయం".

దస్తయేవ్‌స్కీ రచనలోని అనిర్దిష్ట మానసిక ప్రేరణలను, మతపరమైన నీతి సూత్రాలను గాంధేయవాదులయిన భారతీయ రచయితలు నొక్కిచెబుతూ, ఆయన నవలల్లోని సామాజిక సందేశాన్ని అంతగా పట్టించుకోలేదు. ఈ ప్రపంచాన్ని మార్చేందుకు క్రియాశీల కృషి కాదు, మనిషి నైతికాభివృద్ధి వర్తమాన సమస్యలన్నిటి పరిష్కారానికీ కీలకం అని వీరివాదం. అందువల్లనే దస్తయేవ్‌స్కీ తాత్వికతలోని బలహీనమైన అంశాలను రసాభిజ్ఞతా ప్రమాణాలస్థాయికి తీసుకెళ్ళి, మన పరిసర ప్రపంచంలో మెరుగుదలకన్నా నైతిక మెరుగుదలకు ఆయన ప్రాముఖ్యమిచ్చాడనీ, సామాజిక సంస్థల అవినీతికి మనిషి అవినీతే మూలమని ఆయన నమ్మాడనీ చెప్పే పాశ్చాత్య సాహిత్యవేత్తలతో గాంధేయవాదులు యేకీభవిస్తున్నారు.

"దస్తయేవ్‌స్కీ గొప్పతనానికి కారణం మానవాత్మ మహాగాథను ఆయన చిత్రించిన తీరే. ఆ విషయంలో ఆయనకు సరివచ్చేవారు ప్రపంచ సాహిత్యంలోనే యెవరూ లేరు," అని శివదన్ సింగ్ చౌహాన్, "నేరమూ, శిక్ష" కు తన హిందీ అనువాదం పీఠికలో రాశారు.

దస్తయేవ్‌స్కీ నవలల్లోని సామాజిక అంతరార్థాన్ని పోదోసి, కేవలం మనోవిశ్లేషణకు, నీతికి, మతానికి సంబంధించిన అనిర్దిష్ట అంశాలపై దృష్టి కేంద్రీకరించిన పాశ్చాత్య విమర్శలు భారతీయ వాస్తవికతావాద రచయితలకు యేమాత్రం తృప్తి నివ్వలేదు. వలసపాలన కాలంలో సైతం భారతదేశంలోని పలువురు దస్తయేవ్‌స్కీని రష్యన్ సామాజిక రూపాలలోని జటిలతను చిత్రించిన ప్రతిభా శాలిగా పరిగణించారు. దస్తయేవ్‌స్కీ రచనల్లో గర్భితమైవున్న భావం భారతదేశంలో అంతకంతకు స్పష్టమవుతోంది. రష్యన్ ప్రజల దుస్థితిని ఆయన చిత్రించినతీరు రష్యాలోని ఫ్యూడల్ బానిసత్వాన్నే కాక, మొత్తం ప్రపంచంలోని అన్యాయ సామాజిక రూపాలను ఆగ్రహావేశంతో ఖండించడమే. దస్తయేవ్‌స్కీ నవల్లోని ప్రధాన పాత్రలకూ, ఇలాచంద్రజోషీ సృష్టించిన పాత్రలకు మధ్యగల సాన్నిహిత్యాన్ని చూడకుండా వుండ జాలము. జోషీ పాత్రలు ఒక కామాంధునికి అమ్ముబడిన ఒక వేశ్యావృత్తిక వ్యభిచార గృహాల్లో ఆకలితో మాడే ఆడపిల్లలు, తమ పిల్లల్ని అమ్ముకొనే తాగుబోతులు, చౌకబారు లాడ్జీల్లోని బిచ్చగాళ్ళు, ధనవంతులు, విషయలోలురు మొదలయినవారు.

సమకాలీన భారతీయ కల్పనా సాహిత్యంలో పట్టణజీవితం ప్రముఖంగా కనిపిస్తోంది. దీ కీ, దస్తయేవ్‌స్కీ చిత్రించిన ప్రపంచానికి ఉమ్మడిగా వున్న అంశాలు యెన్నోవున్నాయి: కొట్టవచ్చినట్లున్న సామాజిక వైరుధ్యాలు గల పెట్టుబడిదారీ నగరం; దురాశా ప్రేరితులైన దాని ప్రజలు, జీవిత పోరాటంలో ఓడిపోయినవారు, దయారహిత సమాజ బహిష్కృతులు. దస్తయేవ్‌స్కీలాగానే, భారతీయ రచయితలు చాలామందికి, చుట్టూ అలముకొన్న ఈ చీకటిలో ఒక్క ఆశాకిరణం కూడా కనిపించదు. వారివద్ద యే సామాజిక పరిష్కారాలూ లేవు. వారు కేవలం, ఔదార్యం చూపవలసిందిగా, సామాజిక అన్యాయానికి గురి అయిన దురదృష్టవంతుల పట్ల జాలి చూపవలసిందిగా విజ్ఞప్తి చేస్తారంతే.

దస్తయేవ్‌స్కీ వారసత్వంపై వాదోపవాదాలు యెప్పటికీ ఆగిపోవు. దాన్ని గురించిన ఒక నిజమైన శాస్త్రీయ అవగాహన భారతదేశంలో వేరూనుతోంది. అది అపోహలను పారదోలుతోంది. ఇది భారత దేశంలో సాగుతున్న రష్యన్ సాహిత్య చారిత్రక అధ్యయనాల ఫలితం. ఈ రష్యన్ గ్రంథకర్తను గురించిన ఒక వస్తుగత దృక్పథాన్ని వటిష్ఠం చేయడానికి, ఆయన మీద వెలువడిన సోవియట్ పుస్తకాలు కూడ యెంతో తోడ్పడుతున్నాయి.

# రాజ్‌కపూర్ : భారత-సోవియట్ మైత్రికి రాయబారి



వై.కర్బాగవ్, సినీ విమర్శకుడు

సోవియట్-భారత స్నేహసంబంధాల చరిత్రలో రాజ్‌కపూర్ పేరుతో ఒక అధ్యాయం అంతా ముడి పడివుంది. ఆయన చిత్రాలు సోవియట్ ప్రేక్షకులకు భారతీయ చలనచిత్రకళ అంటే ఏమిటో చెప్పాయి. ప్రాచీన భారతచరిత్ర సంస్కృతుల గురించి మరింతగా తెలుసుకునేట్టు, భారతీయ ఆలోచనా సరళిని పరిశీలించేట్టు ఆయన తీసిన చిత్రాలు వారిని పురికొల్పాయి.

1950 దశాబ్ది వుత్తరార్థంలో 'ఆవారా', 'శ్రీ420'చిత్రాలు సోవియట్ యూనియన్‌లోని దాదాపు అన్నిసినిమా హాల్లలో చాలా రోజులు ఆడాయి. యీ చిత్రాలలోని పాటలు రోడ్లమీదా, వేదికలమీదా ప్రతిధ్వనించాయి. కిండర్ గార్టెన్లలో చదివే చిన్నారులు కూడా యీ పాటల్ని పల్లవించారు.

'సంగమ్' – యిది సైకలాజికల్ మెలో డ్రామా 'మేరానామ్ జోకర్' -కన్ఫెషన్ మూడుభాగాల్లో- సినిమాలు విడుదలైన తర్వాత ఎవరి నోట విన్నా రాజ్‌కపూర్ పేరేవినవచ్చింది.

1970లలో భారతీయ చిత్రనిర్మాతల ప్రతినిధి వర్గంతో మనదేశంలో పర్యటించాను. అప్పుడు నేను కలుసుకున్న వారిలో రాజ్‌కపూర్ అంటే తెలియని వారు ఒక్కరూలేరు. అంతేకాదు భారత దేశంలోని ప్రఖ్యాత నటుడు, దర్శకుడు రాజ్‌కపూర్ ఒక్కడేనని ఖారకోవ్, ఖబరోవ్స్క్ మినస్క్, క్రాస్నోయార్స్క్‌లలో కొందరు అభిప్రాయపడ్డారు. 80 ల ప్రారంభంలో మాస్కో లోనూ, తాష్కెంటు లోనూ జరిగిన అంతర్జాతీయ చలనచిత్రోత్సవాల సందర్భంగా నేను రాజ్‌కపూర్‌ను కలుసుకున్నాను అవుత్సవాల్లో నేను దుబాసిగా, సినీ విమర్శకుసిగా పనిచేశాను. అప్పుడు ఆయనను యింటర్వ్యూ చేశాను. సభాసదులనుద్దేశించి ఆయన ఆశువుగా చేసిన వుపన్యాసాన్ని 'జర్యాద్యే' సెంట్రల్ సినిమా హాలులో రెట్రో స్పెక్టివ్ ఫిలింషో ప్రారంభోత్సవం సందర్భంగా ఆయన చేసిన వుపన్యాసాన్ని అనువదించాను.

సినిమాకళను ప్రజలకు చేరువగా తీసుక రావాలని రాజ్‌కపూర్ యత్నించారు. యితర భారతీయదర్శకులందరికన్నా యీ ప్రయత్నంలో రాజ్‌కపూర్ ఎక్కువగా విజయవంతమయ్యారు. ఆయన ప్రేమ అంశాలపై తీసిన చిత్రాలు తీవ్ర సామాజిక సమస్యల గురించి ప్రస్తావించవనే మాట నిజమే. కానీ ఆ చిత్రాలన్నీ "హౌస్‌ఫుల్" కలెక్షన్లకు నోచుకున్నాయి.

రాజ్‌కపూర్ మీద భారత దేశంలో చాలా పుస్తకాలు వచ్చాయి. వాటిల్లో కొన్ని రష్యన్‌లోకి అనువదించడం జరుగుతుంది. సోవియట్ యూనియన్‌లో భారతదేశ ఉత్సవాలను పురస్కరించుకొని గత అక్టోబరులో తాష్కెంట్‌లో జరిగిన భారతీయ చలన చిత్ర వారోత్సవం సందర్భంగా రాజ్‌కపూర్ నటించిన ఉత్తమ చిత్రాల రెట్రాస్పెక్టివ్ ప్రదర్శన నిర్వహించారు. రాజ్‌కపూర్ ఉత్తమ చిత్రాలంటే భావితరాల సోవియట్ పౌరులుకూడ ఎంతగానో యిష్టపడుతారని నేను ఖచ్చితంగా చెప్పగలను.

రాజ్‌కపూర్ సోవియట్ యూనియన్‌లో భారత చిత్రరంగం తరపున అసామాన్యరాయబారి, దూత అని ఆయన అభిమానులు చమత్కరించేవారు. ఆయన సోవియట్, భారతదేశాల మైత్రికి రాయబారిగా ఎల్లప్పుడూ నిలిచివుంటాడని నేనంటాను.

(41వ పేజీ తరువాయి)

యెగుమతి-దిగుమతి సరకులను స్పష్టంగా గుర్తించాల్సిందిగా శ్రీ శంకరనారాయణన్ విజ్ఞప్తి చేశారు. యివి రెండూ పరస్పరావగాహనను మరింత పెంచగలవని ఆయన అభిప్రాయపడ్డారు.

నిర్ణయాలు తీసుకోవడంలో, విదేశాలతో సంబంధాలను నెలకొల్పుకోవడంలో ప్రస్తుతం సోవియట్ కర్మాగారాది సంస్థలకు, మేనేజర్లకు యెక్కువ స్వేచ్ఛ వుంది కాబట్టి, ఆసంస్థలు, మేనేజర్లు నిర్దిష్ట వాణిజ్య వైఖరిని అవలంబించాల్సిన అవసరముందని భారత-సోవియట్ వాణిజ్య మండలి ప్రధానకార్యదర్శి శ్రీమతి రీతాసింగ్ నొక్కి చెప్పారు. ఒక్కొక్కప్పుడు వాణిజ్య సంబంధాల పెరుగుదలకు ఆటంకం కలిగించేది సమాచార కొరతగాక నిర్దిష్టమైన, చక్కగా సమన్వయపర్చిన చర్యలు కొరవడడమేనని ఆమె పేర్కొన్నారు.

భారతదేశంలోని సోవియట్‌యూనియన్ రాయబారి కార్యాలయానికి చెందిన డిప్యూటీ ఎకనామిక్ కౌన్సిలర్ ఇ.ఎ.ఇసాయెవ్ యీ సమావేశంలో వక్తలు వెల్లడించిన అభిప్రాయాలను సూత్రరీత్యా అంగీకరించారు. పరస్పరశక్తిసామర్థ్యాలను, అవసరాలను గుర్తించేందుకు సంయుక్తకృషి అవశ్యమని ఆయన పేర్కొన్నారు. ఖచ్చితమైన, నిర్దిష్టమైన సమాచారాన్ని వ్యక్తిగతంగా, వివరమైన చర్చలద్వారా తెలుసుకునే అవకాశం వున్నప్పటికీ, భారతీయ వాణిజ్యవేత్తలకు ప్రాథమిక సమాచారం యెప్పటికప్పుడు అందుబాటులో వుండేట్టు చూడాలని ఆయన చెప్పారు. భారతదేశంలోని వుత్పత్తి, వాణిజ్య యూనిట్లకు స్పష్టమైన సమాచారం యెలా అందుబాటులో వుండాలో, అలాగే భారతదేశంలోని ప్రైవేటు వాణిజ్యసంస్థల గురించిన సమాచారం సోవియట్ కర్మాగారాది సంస్థలకు స్పష్టంగా అందుబాటులో వుండడం అవసరం. ఉభయదేశాల్లోని యీసంస్థలు పరస్పరం మరింత బాగా తెలుసుకోవడం అవసరం. అయితే క్రమబద్ధమైన సమాచారయంత్రాంగ ఆవశ్యకతను వుపేక్షించరాదని ఆయన అన్నారు.

ఆచరణలో యెదురయ్యే యిబ్బందులను తొలగించేదుకు మరింత సమగ్రమైన సమాచార ఆదాన ప్రదానాలకోసం ఒక కేంద్ర సంస్థ అవసరమని వాణిజ్య కార్య నిర్వాహకుడు శ్రీ ఒ.పి. సచిదేవ్ నొక్కి చెప్పారు. సోవియట్ వాణిజ్య ఆర్థిక కార్యనిర్వాహకులకు యెక్కువ అధికారాలు వున్నాయి కాబట్టి, సమాచారం బాగా అందుబాటులో వుంటోంది కాబట్టి వాణిజ్య సహకారాన్ని శీఘ్రంగా అభివృద్ధిచేయడంలో యెలాంటి ఆటంకమూ వుండాల్సిన అవసరంలేదని ఆయన అన్నారు. భవిశ్యద్‌వకాశాలు విస్తృతంగా, వుజ్జ్వలంగా వున్నాయనీ ఆయన చెప్పారు. సోవియట్ సరకులను తృతీయ దేశాలకు యెగుమతి చేయడానికి మార్కెటింగ్ విషయంలో భారతీయ అనుభవ నైపుణ్యాన్ని వినియోగించుకోవచ్చుని ఆయన సూచించారు. కొన్ని మార్పులు చేసినట్లయితే, యిది భారత-సోవియట్ వాణిజ్య సహకారంలో యెంతో ప్రయోజనకరమైన శాఖ కాగలదనే ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు.

సోవియట్ యూనియన్‌లో సాగుతున్న పునర్వ్యవస్థీకరణ క్రమం వల్ల వస్తున్న గణనీయమైన పరివర్తనలను గురించి భారతదేశంలోని సోవియట్ రాయబార కార్యాలయానికి చెందిన ఎకనామిక్ కౌన్సిలర్ ఆఫీసులోని వాణిజ్య విభాగ అధిపతి వి.వి. కుద్ర్యావవ్ వివరంగా చెప్పారు.

భారత-సోవియట్ వాణిజ్యాన్ని వైవిధ్యపూరితం చేయడానికీ, అనేక రెట్లు పెంచడానికీ విస్తృతావకాశాలు వున్నట్టు యీ రౌండ్ టేబుల్ సమావేశచర్చను సమాహరిస్తూ భారత-సోవియట్ వాణిజ్య మండలి పత్రిక న్యూస్‌లెటర్ ప్రధానసంపాదకుడు శ్రీ పి.సి. భరద్వాజ్ చెప్పారు. వాణిజ్యంలో కొత్త అంశాలను ప్రవేశపెట్టడం, రూపాయల్లో చెల్లించే వాణిజ్యపద్ధతి, భారతదేశ ప్రైవేటు రంగానికిగల అపారమైన ధైర్యసాహసాలు, చొరవ, అపారంగా వున్న ముడిసరుకుల నిల్వలు - భవిష్యత్తు ఆశాజనకంగా వుందని యివన్నీ సూచిస్తున్నాయి. యిలాంటి విషయాల్లో కొన్ని యిబ్బందులు యెదురుకావడం సహజమే; వాటిని కృతనిశ్చయంతో కూడిన సంయుక్త కృషి ద్వారా తొలగించుకోవచ్చు. వాణిజ్య టర్నోవర్‌ను పెంచుకోవడంలో పెద్ద పెద్ద అంగలు వేసే అనుభవం సోవియట్ యూనియన్, భారతదేశాలకు వుందని ఆయన యీ సందర్భంగా పేర్కొన్నారు. సోవియట్-భారత వాణిజ్యానికి సంబంధించి నూతన ధోరణుల యుగాన్ని ఆవిష్కరించడంలో యితోధిక విజయం సాధించడానికి యిదే హామీ.



చీఫ్ పర్సనల్ ఆఫీసర్ లియోన్ అయోనిన్ మైకు వద్దకు వెళ్లి "రిసెప్షన్ మాడ్యూల్‌లో యింకా యెవరైనా వున్నారా" అని ప్రశ్నించాడు.

ఇంద్రధనస్సులోని రంగులను మరిపించే విద్యుత్కాంతులను విరజిమ్ముతూ డ్యూటీలోని మరమనిషి యిలా అన్నాడు: "ఆశావాద గుణకము శూన్యమూ, ఆవేశం అధికమూ, అన్నిటికీ సర్దుకు పోయే వ్యక్తి ఒకరున్నారు."

"లోనికి రమ్మను" అని ఆదేశించి వేదికపైగల తన సీటులో ఆసీనుడయ్యాడు లియోన్.

ధనురాకారంలో వున్న తలుపులు వైదొలిగాయి. ఆ వ్యక్తి ప్రవేశించి, వేదిక వద్దగల ముక్కాలిపీట వద్ద నిల్చున్నాడు.

"కూర్చోండి. విషయమేమిటో ఒక నిమిషంలో పూర్తి చేయండి" అని అన్నాడు లియోన్.

"నాకు వుద్యోగం కావాలి సార్" అని అన్నాడు ఆ వ్యక్తితడబడుతూ.

"మీ కంప్యూటర్ ఫైల్ యివ్వండి" అని అన్నాడు లియోన్.

"చిత్తం, సార్" అని ఆ వ్యక్తి కాసెట్ యిచ్చాడు. లియోన్ దాన్ని పనోరమా డిస్ప్లేలో పడేశాడు. తలతలలాడే తెరపై సూచీలు పడుతున్నాయి: భౌద్ధిక చలనశీలత సంకేతాలు; స్ఫూర్తి గుణకాలు; కర్తవ్యనిరతని యితర సంబంధాలను తెలిపే గ్రాఫులు; ఆ వ్యక్తిలో అన్ని సల్లక్షణాలువున్నాయి. లియోన్ ఆనందానికి అంతులేదు. యిలోగా తెరపై ఆ వ్యక్తి అనువంశిక వివరాలు కనిపించాయి. వాటిని చూచి లియోన్" మీకు వుద్యోగమివ్వలేము. జాతి సంబంధమైన మాలిన్యం. తెలుసా" అనిపెడ మొహం పెట్టాడు.

ఉద్యోగార్థిమీద పిడుగు పడినంత పనైంది. "నేనేం కావాలి" అని అన్నాడు వణకుతున్న పెదమలతో.

"నేనేం చేయలేను, మి వంశ పారంపర్యత అభ్యంతరకరంగా వుంది." అనికటువుగా అన్నా

## ......వెనుకటి గుణమేలమాను

డు లియోన్.

"నాలోని సలక్షణాలను మీరు గుర్తించారు కదా!" అని ప్రాధేయపడ్డాడు వుద్యోగార్థి.

"మీ జన్యులు మా సంస్థకు తగినవికావు" అని చీదరించుకున్నాడు లియోన్.

"నాది పెద్ద కుటుంబం సార్."

"నేనేంచేయులేను. యిందుకు మీ ముత్తవ్వను నిందించాలి." అని కంప్యూటర్ బటన్ నొక్కి తెరవైపు చూపుతూ" చూశావా, ఆమె శిలమెటు వంటిదో" అని విచారంగా అన్నాడు లియోన్.

ఉద్యోగార్థి వైదికవైపు అకస్మాత్తుగా రావడాన్ని గమనించిన లియోన్ వెంటనే పారాలైజింగ్ పిస్టల్ అందుకొని, నీ తెలివేమీ పనిచేయదన్నట్టు "ఇక యేంచేస్తావ్?" అని ప్రశ్నించాడు.

"మీకో వర్తమానం, సార్" అని ఉద్యోగార్థి ఒక సిలికాన్ క్రిస్టల్‌ను అందించగా లియోన్ వణుకుతూ దాన్ని తనకనురెప్పలపై హత్తుకొని అందులోని విషయాన్ని చదివాడు :

"నాకో సహాయం చెయ్యవయ్యా పెద్దమనిషి. యీ పిల్లవానికి వుద్యోగమివ్వు. నీకు తెలుసుకదా, చేసిన మేలు మరువను. మంచి పిల్లవాడు. ఫర్వాలేదు".

చీఫ్ పర్సనల్ ఆఫీసర్ పాతగాడిలో పడియిలా వుపదేశించాడు."నీకు వుద్యోగమిస్తున్నాను. కాని మా సంస్థ దీక్షా వాక్యాన్ని గుర్తుంచుకో : కచ్చితంగా సరియైనవారిని ఎంపిక చేయడం అనేవి విజయానికి రాచబాట అర్థమైందా?".

## ప్రత్యేక సమాచారం

అర్బాత్ వీధి చరిత్ర ప్రసిద్ధమైన ప్రదేశం. ఆ వీధిలోకి పాదాచారులకు మాత్రమే అనుమతి వుంది. ఆ వీధిలోని ప్రతి ఒక్కయిల్లు దానికదే సాటి. సోవియట్ రాజధానికి అర్బాత్ ఒక సాంస్కృతిక, వాణిజ్య కేంద్రంగా వుండాలని చరిత్ర నిర్దేశించింది. ఆది కవుల, కళాకారుల, సంగీత విద్వాంసుల వీధి వందలాది వినోద యాత్రికులను యిది ఆకర్షిస్తున్నది.

ఏడు దశాబ్దాల సోవియట్ పేయింటింగ్స్

ప్యోత్ పెత్రోవిచ్ కంచాలోవ్‌స్కి (1876-1956) సోవియట్ ఆర్ట్ అకాడమీ సభ్యుడు, రష్యన్ ఫెడరేషన్ పీపుల్స్ ఆర్టిస్ట్. ఆయనకు ప్రపంచం గురించిన ఆశావాద అవగాహన వుంది. పాల్ సెజనె చిత్రాల్లోని లేతరంగుల శైలిని, రష్యన్ జానపద కళల వుజ్వలమైన రంగులతో మేళవించడానికి ఆయన కృషి చేశాడు. ఆయన కాన్వాసుపై వేసిన చాలా చిత్రాలు జీవితపు సుఖసంతోషాను మనసుకు హత్తుకునేట్టు తెలియజేస్తాయి.



# టూకీగా



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M276 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |